# మూడేళ్ళ ముచ్చట



## ఆంటన్ చెకోవ్

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

# మూడేళ్ల ముచ్చట

(నవల)



రచన:

ఎ. చెకోవ్

అనువాదం:

వి. గంగాధరరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

# అంకితం

నా తోడు

నా నీడ

నా ఆసట

నా బాసట

నా పద్మకు



# 1

వీధి చివరయున్న భారకాసుల వెనుక బాలచంద్రు డుదయిస్తున్నాడు. అచ్చటచ్చట యిండ్లలోని లైటులవల్ల, కిటికీలనుండి వచ్చే కాంతి తప్ప, అంతా మసక మసకగానే యుంది. లిప్టోవు యింటిముందున్న బల్లమీద, ఎదురుగా దగ్గరలో యున్న చర్చిలో ప్రార్థనలు పూర్తి అవ్వటంకొరకు ఎదురుచూస్తూ కూర్చున్నాడు. యూలియ తరువాత చర్చి నుండి బయిటికి వస్తుందని, ఆమెతో మాట్లాడవచ్చునని, బహుశ అదృష్టముంటే, రాత్రంతా ఆమెతో గడుపవచ్చునని అతని ఆశ.

అతడు దాదాపు గంటనుండి ఆమెకొరకు నిరీక్షిస్తూ కూర్చొనియున్నాడు. అనేకవిషయాలనుగూర్చి ఆలోచించటం సాగించాడు. మాస్కోలో అతను నివశించే యిల్లు, అతని స్నేహితులు, పనిమనిషి "ఫియోటకు", అతను కూర్చొని చదువుకొనే గది, బల్లమీద పుస్తకాలు మొదలగు అనేక విషయాలు అతనికి గుర్తు రావటం మొదలుపెట్టాయి. ఒకసారి చీకటిలోనికి చూశాడు. చీకటిలో నిశ్చలంగాయున్న చెట్లు అతనిలో ఒక నూతన అనుభూతిని కలుగజేశాయి. ఆవుల సందడివల్ల రేగే దుమ్ముతో నిండియున్న ఆ ప్రదేశం అతని

కెంతో సుందరంగా కన్పించింది. అతని ఆలోచనలు మరల మాస్కోలో, అతనికి, అతని స్నేహితులకు మధ్య - జీవితం, ప్రేమనుగూర్చి, ప్రేమలేని జీవితం నిస్సారంగాదని, ప్రేమించ కుండా, ప్రేమింపబడకుండా, జీవించటం చాల స్వాభావికమే నని, ప్రేమ మానసిక సంబంధమైనది కాబట్టి ప్రేమనేది ప్రత్యేకంగా ఏమీ లేదని, శరీరాల ఆకర్షణ మాత్రమేనని - జరుగు మొదలగు వాదోపవాదాలమీదకు మళ్ళినాయి. ఇక యిప్పుడెవరైనా అతనిని ప్రేమనుగురించి గనుక అడిగినట్లైతే తనకేమీ తెలియదని తలంచాడు.

చర్చినుండి జనం బయటికి వస్తున్నారు. లిప్టోవ్, చీకట్లో పోయే వ్యక్తులవంక జాగ్రత్తగా, పరిశీలనగా చూస్తున్నాడు. మతాధిపతి కూడా వెళ్ళి చాలాకాలమయింది. కానీ ఇంకా జనం గుంపులు గుంపులుగా బయటకు వస్తూనేయున్నారు. కొందరు కిటికీలవద్ద, గడపలవద్ద నిలబడి మాట్లాడుతున్నారు. ఎలాగయితేనేమి చివరకు లిప్టోవ్ ఒక పరిచయ గొంతుకను విన్నాడు. హృదయం వేగంగా కొట్టుకొనసాగింది. కానీ యూలియా అతను ఊహించినట్లు ఒంటరిగా యుండలేదు. వెంట ఎవరో ఇద్దరు స్త్రీలున్నారు. నిస్పృహ, నిరాశలతో లిప్టోవ్ కృంగిపోయాడు.

బజారు మలుపుకు వచ్చేటప్పటికి, ఆ యిద్దరు స్త్రీలు యూలియాను వదలివెళ్ళారు. యూలియా ప్రక్కకు తిరిగి లిప్టోవ్‌ను చూచింది.

"నేను ఇప్పుడే మీ నాన్నగారిని చూడాలని బయలు దేరాను. ఇంటివద్ద యుంటారుగదా ?" అని అన్నాడు.

"ఉండి యుండవచ్చు. క్లబ్బుకు టైము కాలేదుగా" అని జవాబిచ్చింది.

ఆదారివెంట అనేక తోటలున్నాయి. ఆ పెద్ద నిమ్మ చెట్లవల్ల, కంచెలవల్ల ఆ త్రోవంతా చీకటిగానే యున్నది. అప్పుడప్పుడు స్త్రీల గొంతుకలు, వికవికలు, పకపకలు, మిణుగురుపురుగుల సందడి తప్పితే, ఆ చీకటిలో అంతా ప్రశాంతముగా యుంది. అనేకరకాల శబ్దాలు, నిమ్మచెట్ల పువ్వుల వాసనలు, యూలియ ప్రక్కన నడుస్తున్న లిప్టోవ్‌లో కోర్కెలను రేపాయి. ప్రక్కన నడుస్తున్న యూలియ నడుము చుట్టూ చేయి పోనిచ్చి, దగ్గరకు తీసుకొని ఆమెముఖం, పెదాలు, చేతులు, బుజాలు, ముద్దులతో నింపివేయాలని ఆనందావేశాలతో ఏడుస్తూ ఆమె కాళ్ళపైబడి అతనెంత కాలము నుండి ఆమె కొఱకు వేచియుంది, తన ప్రేమను వెళ్ళ గక్కాలనిపించింది. ప్రేమ దైవత్వమని, పూజనీయమని, తను విన్న, నేర్చుకొన్న మాటలు గుర్తుకు రావడంవల్ల ఆమె తనను ప్రేమించడం లేదని, ప్రేమించదని తను కలలుగంటున్న వైవాహిక జీవితం, అనురాగ ఆనందాల జీవితం తన కెన్నటికి రాదని, అది యొక కలగానే యుండిపోతుందని భావించుటవల్ల ఆమెచుట్టూ ఏదోఒక భయంకరశక్తి ఆవరించి యున్నట్లుగా ఆమెను అంటుకొనటానికి భయపడ్డాడు.

యూలియ అతని అక్క "నైన" ఆరోగ్యం గూర్చి ఎంతో బాధగా జాలితో అడిగింది.. నైన కాన్సరుతో బాధ పడుతూ యుండగా ఆపరేషను చేశారు. మరల తిరుగబెడు తుందేమోనని అందరికీ భయంగా యుంది.

"ఉదయమే నేనామెను చూడటానికి వెళ్ళాను. ఆమె అదోకరకంగా వున్నట్లనిపించింది నాకు. ఇదివరకటికన్నా ఏమంత బలహీనంగా లేదు. కాని చాలా నీరసంగా, తెల్లగా పాలిపోయినట్లుగా కన్పించింది" అన్నది.

"అవును, జబ్బు తిరగబెట్టడం కాదుగాని, రోజు రోజుకూ నీరసించి పోతూయుంది. కారణమేమిటో నాకర్థం గాకుండా యున్న" దన్నాడు లిప్టోవ్.

"ఒకనాడామె ఆరోగ్యంగా, పుష్టిగా, ఎర్రని బుగ్గలతో ఎంతో అందంగా యుండేది" అంటూ యూలియ కొంచెం సేపు ఆగి మరల "మాస్కో-పిల్ల, మాస్కో-పిల్ల" అని ప్రతివారు పిలుస్తూ యుండేవారు. ఎంతో అందంగా నవ్వుతూ వుండేది. ఇచ్చటకు శెలవలకు వచ్చినప్పుడల్లా పల్లెటూరిపిల్లలా దుస్తులు ధరించేది. ఆ దుస్తులలో ఎంతో అందంగా వుండే"దన్నది.

లావుగా, ఎర్రని ముఖంతో మోకాళ్ళవరకు పొడుగుగా వుండే కోటు తొడుక్కొని, చేతులు జేబులో పెట్టుకొని, పిచ్చివానిలా "రరూ, రరూ" దని పాడుకుంటూ యింట్లో అటూ ఇటూ తిరుగుతూ వున్నారు డాక్టరుగారు. ఆ కోటువల్ల అతని కాళ్ళు చాలా పొట్టివిగా కన్పిస్తున్నాయి. అతని తెల్లని మీసాలుగాని, తలవెంట్రుకలుగాని, దువ్వినట్లుగా లేదు. అప్పుడే నిద్రనుండి లేచినట్లుగా వున్నాడు. అతను కూర్చుని చదువుకొనే గది కూడా చాలా చిందరవందరగా యుంది.

"లిప్టోవ్ నిన్ను చూడాలని వచ్చారు నాన్నా" అని గదిలోకి అడుగు పెడుతూనే యూలియా తండ్రితో అన్నది.

"రుస్రూ, రుస్రూ" అని పాడుకొంటూ, గట్టిగా అడుగులు వేసుకుంటూవచ్చి "ఏమిటికబుర్లు? ఏమిటి?" అంటూ లిప్టోవ్‌తో కరచాలనం చేశాడు.

డ్రాయింగు రూము చీకటిగాయుంది. లిప్టోవ్ చేతిలో టోపీతో నిల్చునేయుండి అంతరాత్రి తనువచ్చి డాక్టరుగారికి శ్రమయిస్తున్నందులకు క్షమార్పణ చెప్పుకొని తన అక్క రాత్రిళ్లు నిద్రపోవటానికీ, రోజు రోజుకు క్షీణించి పోవడానికి కారణం, అడిగాడు. అదేప్రశ్న డాక్టరుగారు ఉదయం వచ్చినప్పుడు, అడిగియుండుటవల్ల అదోకరకంగా బాధపడుతూనే ఆ ప్రశ్నలు వేశాడు.

"బహుశ మాస్కోనుండి యింకొక డాక్టరుని పిలిపించటం మంచిదేమో! మీ ఉద్దేశ్యం ఏమిటి?" అని లిప్టోవ్ డాక్టరుగారి నడిగాడు.

డాక్టరుగారు నిట్టూర్చి అదోకరకంగా చేతులుత్రిప్పారు.

డాక్టరుగారి మనస్సుకు నిజంగానే కష్టం కల్గింది. ఆయన సహించలేకపోయాడు. తనని ఎవ్వరూ నమ్మరని అతని రోగులుకూడా అతని మంచితనాన్ని ఆసరాగా తీసుకుని, అతనిని దోచుకొంటారనీ తోటివారు తనని చాలా తేలికగా చూస్తారనీ అతనెప్పుడూ అనుకొని బాధపడుతూ యుంటాడు. అందువల్లనే అతనికి అకారణంగా కోపంవస్తూ వుంటుంది. తనలో తాను తనకు తాను అసహ్యించుకుంటూ వుంటాడు. తనలాంటి తెలివి తక్కువ దద్దమ్మలు, మూర్ఖులు అలా బ్రతికేకంటె చనిపోవటం మెరుగుగా తలంచుతూ యుంటాడు.

యూలియ దీపం వెలిగించుకొచ్చింది. దీపపు వెలుగులో, యూలియ ముఖాన్ని, వంపు, సొంపులను చూసిన లిప్టోవ్ ఆమెచాలా అలసిపోయినదని, విశ్రాంతి తీసుకొనదల్చుకుంటూందని తలంచాడు. ఆమె దగ్గరలో కుర్చీలో కాళ్ళపై చేతులు పెట్టుకొని కూర్చొన్నది. లిప్టోవుకు తెల్సు తను అనాకారినని. మరీ యిప్పుడది తరచుగా అతనికి గుర్తుకు వస్తూంది. అతను సన్నగా, పొట్టిగా, ఎర్రని బుగ్గలు గల్గి వుంటాడు. అతని ముఖంలో ఏ స్త్రీ అయినా చూడాలనుకొనే అందచందాలు లేవు. నల్గురినీ ఆకర్షించే ఏ కళా అతనిలో లేదు. కనీసం మాటలతోనైనా నల్గురిని ఆకర్షింపగల నేర్పరితనంకూడా లేదు. ఎక్కువగా మాట్లాడతాడు, మాట్లాడటం మొదలుపెడితే, ఎచ్చట ఎలా ప్రవర్తించాలో, మాట్లాడాలో కూడా తెలియదు. ఇప్పుడు తనను తానే ఎంతగానో అసహ్యించుకొంటున్నాడు. అతను గనుక మాట్లాడటం మొదలు పెట్టితే యూలియాకు విసుగెత్తి తన సముఖంనుండి వెళ్ళిపోతుందని అతనికి తెల్సు. కాని ఏదొకటి మాట్లాడాలి. ఏమి మాట్లాడాలి? ఎలా సంభాషణ మొదలు పెట్టాలి? మళ్ళీ తన అక్క జబ్బును గూర్చేనా?

మందులను గూర్చి ఆరోగ్యం విషయాలను గూర్చి, అనేకసంగతులు చెప్పాడు. తానొక వసతి గృహం కట్టించదల్చుకొన్నట్లు, దానిలో పని పాటలు చేసుకొనే వాళ్ళకు, చాలా చవుకగా, 4 లేక 5 కోపెకులతో క్యాబేజి సూపు, రొట్టె, సామానులు పెట్టుకొనటానికి స్థలము, బట్టలు ఆరవేసుకోటానికి

అవకాశము, పరువు, దుప్పటి మొదలగు సదుపాయాలు మాస్కోలో తాను కల్పించదల్చుకొన్నట్లుగాకూడా చెప్పాడు.

సాధారణంగా ఎప్పుడూ యూలియా అతనిముందు ఎక్కువగా మాట్లాడదు. బహుశా, గమ్మత్తుగా ప్రేమికిని సహజ జ్ఞానంతో, అతనామెయొక్క ఉద్దేశ్యాలు, ఊహలు, ఆలోచనలు ఊహించుతుడేవాడు. అలాగే యిప్పుడు కూడా ఆమె తనగదికి వెళ్ళలేదు కాబట్టి "టీ" త్రాగలేదు గనుకను, మరల బయటకు వెళ్ళ వచ్చునని ఊహించాడు.

"నేను ఆలాడ్జిని గూర్చి తొందరపడడం లేదు. అసలు కొంతకాలం వరకు ఆగాలని యుంది. కష్టించినా, బహుశా అది పవిత్రమైన బూటకపు రాయళ్ళ చేతులలోగాని, దయా దాక్షిణ్యాలు, పరోపకార బుద్ధిగల్గి, మంచివాటిని సర్వనాశనం చేసే ఆడవాళ్ళచేతులలోగాని పడవచ్చునని నాభయం" అని తనవంక నిశ్చలంగా, ఆశ్చర్యంగా, చూస్తూయున్న డాక్టరుతో అన్నాడు కోపంగా.

"రురూ, రురూ" అంటూ పాడుకొంటున్నారు డాక్టరు గారు.

యూలియ లెగిసి "క్షమించండి నాకు వెళ్ళవలసిన పని యుంది. మీ అక్కను అడిగినానని చెప్పండి" అన్నది.

యూలియ వెళ్ళగనే లిప్టోవ్ కూడా డాక్టరువద్ద శలవు తీసుకొని బయలుదేరాడు. ఇంతకుపూర్వం ఎంతో సుందరవందనంగా కన్పించిన నిమ్మచెట్లు, ఇప్పుడు చాలాఅంద వికారంగాను, అసహ్యంగాను భగ్నహృదయులకు కన్పించు నట్లుగా, శూన్యంగా, నిర్జీవంగా కన్పించాయి. చంద్రుడు

మేఘాలుపందా లేసుకున్నట్లుగా పరుగెత్తుతున్నాయి. "ఆహా, ఏమిపల్లెటూరి చంద్రుడూ, గట్టిమోపులులా దేబిముఖాల మేఘాలు" అని అనుకొన్నాడు తనలో తాను. తన సంభాషణను గూర్చి తనే ఎంతో సిగ్గుపడ్డాడు. మరల రేపు తనకు ఆమెను చూడాలనిపిస్తుంది. మాట్లాడాలని పిస్తుంది. మరల ఆమెకు తనంటే లెక్క లేదనే గట్టి నిశ్చయానికి వస్తాడు. ఇలా ప్రతి రోజూ జరుగుతూనే యుంటుంది. అలాగే రోజులు వాటంత టవే దొర్లిపోతున్నాయి. దానికి అంతం ఎప్పుడు ? ఆ శుభ గడియ లెప్పుడొస్తాయో ?

ఇంటికి రాగానే తిన్నగా అక్క గదిలోనికి వెళ్ళాడు.

నైనా చాలా ఆరోగ్యంగానే యున్నట్లు కన్పిస్తుంది. అలా ఆమె కళ్ళు మోసుకుని, వెల్లికిల పరుండియుంటే చావు ఆమెకు దగ్గరలో వుందని ఎవరూ అనుకొనరు.

సష, పదిసంవత్సరాల నైన పెద్దకూతురు, తల్లి ప్రక్కన కూర్చుని, పుస్తకం బిగ్గరగా చదువుతూ యుంది.

"అలక్సీ వచ్చా"డని జబ్బుమనిషి గొణిగింది.

మేనమామ, మేనగోడలు, ఒకరిని విడిచి ఒకరు ఎప్పుడూ జబ్బు మనిషివద్ద కూర్చొని వుంటారు. సష ఏమి మాట్లాడకుండగనే పుస్తకం మూసి వెళ్ళిపోయింది. లిప్టోవ్ ఒక చరిత్రాత్మక నవలను తీసుకొని, పూర్వం చదివి విడచిన పేజీనుండి బిగ్గరగా చదవటం మొదలు పెట్టాడు.

నైన మాస్కోలో పుట్టి పెరిగింది. నైన తండ్రి మాస్కోలో పెద్దవ్యాపారస్థుడు. ఆమెకు ఇద్దరు తమ్ముళ్ళు. వాళ్లు ముగ్గురూ మాస్కోలో యున్న తండ్రిగారి యింటిలో

చాలా భయభక్తులతో పెరిగి పెద్దవారయ్యారు. తల్లి జబ్బుతో తీసుకొని చచ్చిపోయింది. తండ్రి అంటే అందరకు చాలా భయంగా వుండేది. చాలాసార్లు ఆమెను కొట్టాడుకూడాను. ఇంట్లో పనివాళ్ళు కూడా చాలా మొరటుగా అపనమ్మకంగా ప్రవర్తిస్తూ యుండేవారు. చివరకు వాళ్ళయింటికి వస్తుండే స్వాములు కూడా బూటకాల రాయుళ్ళే. త్రాగి, తిని, వాళ్ళ తండ్రిని ఎదుట పొగడి వెనుక తిడు తూండేవారు. మగపిల్లలు కొంతవరకు అదృష్టవంతులు, చదువుకునే అవకాశం వారికి దొరికింది. నైనకు అలాటి అదృష్టం లేకపోయింది. కొద్దిగా వ్రాయగలదు. చారిత్రాత్మక నవలలు చదవటంకన్న మరేమీ చదవటం ఇష్టముండదు.

ఇప్పటికి 17 సంవత్సరాలకు పూర్వంనైన 22 సంవత్స రాల వయస్సులో యున్నప్పుడు తను పెండ్లాడిన భర్త ఘన శ్యాను, ఒక వేసవిలో "కిముకి"లో కలుసుకొన్నది. వెంటనే ప్రేమించటం, తండ్రి ఉద్దేశ్యానికి వ్యతిరేకంగా పెళ్ళి చేసు కొనటం జరిగింది. ముసలాయనకు స్థితిమంతుడు, అహంకారి, అందమైన అల్లుడు, ఈలలు వేసుకొంటూ తిరుగుతూయుండడం దేవునివద్దనున్న దీపంతో సిగిరెట్లు ముట్టించుకొనటం, యిష్టం లేకపోవటమేగాక, అతనిని చాలా పోకిరీవానిగా అల్లర, చిల్లర వానిగా కూడా తలంచాడు. ఆ అల్లుడు కట్నం డబ్బుకొరకు ఉత్తరాలు వ్రాసే రోజుల్లో ముసలాయన కూతురుకు తన భార్య బట్టలు, నగలు, వాటితోపాటు డబ్బు 30,000 రూపా యలు పంపాడు. కాని వాళ్ళను దీవించి వాళ్ళశుభం కోర నిరాకరించాడు. తరువాత మరలొకసారి, మరొక 20,000

రూబులులు పంపాడు. మొదట పంపిన డబ్బు, యీ డబ్బు, స్వంతడబ్బు, యిల్లు, ఏవీ అల్లుడుగారివద్ద ఎక్కువకాలం వుండటం జరుగలేదు. తరువాత ఉద్యోగం సంపాదించుకొని పనర్వ్ యింకొక చోటుకు వెళ్ళాడు. అచ్చట ఉద్యోగంతో పాటు ఇంకొక కుటుంబాన్ని కూడా సంపాదించాడు. ఈవిషయం మీద అనేక గుసగుసలు బయలు దేరాయి. కాని అతను కూడా ఏమీదాచ ప్రయత్నించలేదు.

నైన తనభర్తను ఎంతగనో ప్రేమిస్తూ గౌరవిస్తూ, పూజిస్తూ వుండేది. ఆమె ఆచరిత్రాత్మక నవలలు వింటు న్నంతసేపూ ఆమె గతాన్నిగూర్చి ఆలోచిస్తూనే వుండేది. అదిఎంతదుఃఖ భూయిష్టమైనది. విచారకర మైనదో! ఎవరైనా దానిని ఒక పుస్తకంగా వ్రాయటం జరిగితే ఎంతవిషాదకరంగా తయారవుతుందోనని ఆలోచిస్తూవుంది. ఇప్పుడుతనరొమ్ములో కుదుపు లెగవటానికి తన అనారోగ్యానికి అసుఖమైన ప్రేమ, తన ఏడ్పూ కారణమని ఆమెనమ్మకం.

అలెక్సీ పుస్తకం మూసి వేశాడు.

"అదిపూర్తి అయినది. రేపు ఇంకొకటి మొదలు పెడ దాము. ఇప్పుడు దేవుని ప్రార్థిద్దాము" అని అన్నాడు.

నైన నవ్వింది. అదొరకంగా చాలా తేలికగా నవ్వింది. అకారణంగా అలా తనలోతాను నవ్వటానికి కారణం అజబ్బే నని, ఆ జబ్బు ఆమె మెదడును కూడా చెడగొట్టి యుంటుందని లిప్టోవ్ అనుమానించటం సాగించాడు.

"యూలియా నీవులేనప్పుడిచ్చటికివచ్చి వెళ్ళింది" అని అన్నదినైన "ఆమెకు ఆమె తండ్రివైద్యంలో ఎక్కువగా

నమ్మకం లేనట్లయింది. తన తండ్రివద్ద మంచు తీసుకొంటూనే ఏస్వామిగారినైనా పిలిపించి పూజలు చేయించమన్నది. ఈ డౌనులో ఎవరో స్వాములున్నారంట. నీకు తెల్సునా? యూనియా• తన గొడుగు మర్చిపోయి వెళ్ళింది. రేపది తప్పక పంపించు" అని మరల కాసేపాగి "పోయేరోజులు రావాలే గాని ఆ సమయం వచ్చినప్పుడు డాక్టర్లుగాని స్వాములుగాని ఎవరూ ఆపలేరు" అన్నది.

"నైన నీవెందుకు ప్రశాంతంగా నిద్రపోవు రాత్రిళ్ళు" అని అడిగాడు, లిస్టోవ్ సంభాషణ మార్చాలనే వుద్దేశంతో.

"నాకు తెలియదు. నిద్రపట్టదు. ఇలా మంచంపై పడుకొని అనేక విషయాలాలోచిస్తూయుంటాను."

"ఏమిటమ్మా నీవాలోచిస్తూయుండేది."

"పిల్లలను గూర్చి, నిన్నుగూర్చి, నాజీవితం గూర్చి నేనెంతో నికృష్టజీవితం గడిపాను అలెక్సీ. గతంఅంతా గుర్తుకు వస్తూంటుంది." అని నెమ్మదిగా నవ్వి మరల "నాకు అయిదుగురు పిల్లలు పుట్టారు. అలెక్సీ, అందులో ముగ్గురిని సమాధిచేశాను. నేను నొప్పులు పడుతూండే సమయంలో కూడా నా భర్త, ఆ యితర స్త్రీతో కులుకుతూ, కుషామత్ చేస్తూండేవాడు. మంత్రసాని కొరకు పంపటానికి కూడా మనిషివుండే వాడుగాదు. నాకు నేనే వంటయింటిలోకో బయటవరండాలోకో మనిషికొరకు వెళ్ళవల్సి వచ్చేది. అలాంటప్పుడు వరండాలో షాపులవాళ్ళు వడ్డీ వ్యాపారస్తులు మొదలగువారు బాకీలు వసూలుచేసుకొనటానికి వచ్చి ఆయన కొరకు కూర్చుని యుండేవారు. నాతల తిరిగి పోతూండేది.

భయంతో కంపించిపోతూండేదానను. నాతో నోటితో చెప్పక పోయినా ఆయన నన్నెప్పుడూ మనస్ఫూర్తిగా ప్రేమించనేలేదు. నేను వయస్సులో నున్నప్పుడుకూడా నేనెప్పుడూ సుఖపడలేదు. దుఃఖం, విచారంతోనే కాలంగడిపాను. మా తోటలో ఆయన యింకొక స్త్రీతో వుండగా నా కళ్ళతోనే చూశాను. నేను వెంటనే వెనుకకు తిరిగి ఎక్కడకు వెళ్ళుతున్నానో కూడా తెలియకుండా వెళ్లి చర్చిమెట్లపై నాకన్నీళ్ళతో చీకట్లోనే "మేరీని" ప్రార్థించాను" అని చెప్పింది నైన విచారంగా.

ఆమె సొలి తీర్చుకొనటానికి కొద్దిసేపు ఆగి కొద్దిగా విశ్రాంతి తీసుకొని "నీవు చాలాదయగలవాడవు అలెక్సీ. నీవు చాలా మంచివాడవు...... తెలివిగలవాడవు" అన్నది వినీ వినపడనట్లుగా, తమ్ముని చేతిని తన చేతిలోనికి తీసుకొని. అర్థరాత్రప్పుడు యూలియ గొడుగు తీసుకొని లిఫ్టోవు నైన గదినుండి బయటకువచ్చాడు. చాల ప్రొద్దుపోయినా అంతా ఆ యింట్లో మేల్కొనేయున్నారు. ఇల్లు ఒక క్రమపద్ధతిలోనే లేదు. పని మనుష్యులు వంటయింట్లో కూర్చొని టీ త్రాగుతున్నారు. పిల్లలుకూడ మేల్కొని, వంటయింట్లోనే కూర్చొని నెమ్మదిగా మాట్లాడుతున్నారు. దీపం ఆరిపోవ సిద్ధంగావుంది. ఇంట్లో అద్దంపగలటం, నైన చెప్పులు తొడుక్కొన బోతూయుండగా, ఆమె చెప్పులనుండి ఎలుక బయిటకురావటం, మొదలగు దుశ్శకునాలతో పిల్లలు, పెద్దలు అంతా భయపడిపోయారు. పిల్లలకు కూడ దుశ్శకునాలు, వాటి పర్యవసానంగూర్చి బాగానే తెల్సు, సన్నని, నల్లని

వెంట్రుకల పెద్ద అమ్మాయి "సషా" భయంతో కంపించి పోతూ బల్లమీద కూర్చొని వున్నది. ఏడు సంవత్సరాలున్న చిన్న అమ్మాయి "లిడ" సషా ప్రక్కనే నిల్చొని యుంది.

లిప్టోవు క్రిందిభాగంలో యున్న తన గదిలోనికి వెళ్లాడు. తను కూర్చొని చదువుకొనే గదిలో, నైన భర్త ఘనర్స్వే వార్తా పత్రిక చదువుతూ కూర్చొని యున్నాడు. లిప్టోవ్ వచ్చి అతనికి ఎదురుగా కూర్చొన్నాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. వాళ్ళు యిద్దరూ ఎంతకాలమైనా ఒకరితో నొకరు మాట్లాడకుండా నిశబ్దంగా కూర్చొనగలరు.

చిన్న పిల్లలువచ్చి, నిద్రపోవటానికి వెళ్ళుతున్నామని యిద్దరికీ చెప్పి, వాళ్ళచేతులు ముద్దు పెట్టుకొని వెళ్లిపోయారు.

పిల్లలు వెళ్ళిపోయిన తర్వాత, వార్తా పత్రిక ప్రక్కన పెట్టి ఘనర్స్వే "ఏమీ తోచటంలేదు, దేవుడంటే భయపడే ఛాదస్థులు, జీవితంలో ఆనందం అంటే ఏమిటో తెలియని అనాగరికులు వుండే టవునిది" అని, నిట్టూర్పు విడచి మరల "ఎలాగయితే సరదాగా కాలం గడపటానికి నీకైనాఅవుకాశం దొరికింది" అన్నాడు.

"మీ ఉద్దేశ్యం ?" లిప్టోవు ప్రశ్నించాడు.

"నిన్న నీవు డాక్టరు "బాల్వైన్"గారి యింట్లోనుండి వస్తూండగా చూశాను. నీవు తండ్రిగారికొరకు వెళుతూ యుండటంలేదుగదా !"

"అదేమీగాదు" అన్నాడు లిప్టోవు సిగ్గుపడుతూ.

"సహజమేగా. ఆ అమ్మాయి తండ్రొక మొద్దు, నల్లమందుభాయి. నేనలాంటి మూర్ఖుడను, పల్లెటూరి గబ్బిలా

యని ఎచ్చటా చూడలేదు. మీరు ప్రకృతినిగూర్చి, చెట్లు, చేమలు, వాటిఅందాన్నిగూర్చి మాత్రమే తెల్సుకొనప్రయత్ని స్తారు, పొగడుతూయుంటారు. కాని అంతా నీచం, అసహ్యాం, మురికికూటం, తెలివితక్కువతనం. అంతే, అంతకన్నా మరేమీ లేదు. ఉదాహరణకు, చదువరులను, విజ్ఞానవంతులను తీసి కొనండి, యిచ్చట 23 మంది డాక్టర్లు, సంపాదించుకొని, యిల్లు కట్టించుకొని యుంటున్నారు. కాని ప్రజలుమట్టుకు మామూలుగానే యున్నారు. 'సైన'కు చిన్న ఆపరేషను చేయవల్సివచ్చినప్పుడు కూడ, యిచ్చట ఎవ్వరికీ దమ్ములు లేకపోయినాయి. అందువల్లనే మాస్కోనుండి డాక్టరును తీసు కొని రావల్సివచ్చినది. వాళ్ళకేమీ తెలియదు. ఇతరులనర్థం చేసుకొన ప్రయత్నించరు. దేనిలోను ఆసక్తి వుండదు. నిజం తెల్సుకొనాలనుకొంటె వాళ్ళనడిగిచూడు, 'క్యాన్సరు' ఎలా వచ్చిందో? అసలు క్యాన్సరంటే ఏమిటో?"

ఫనర్వో క్యాన్సరునిగూర్చి చెప్పటం మొదలుపెట్టాడు. అతనికి కొద్దిగా 'సైన్సు'తో పరిచయముంది. ప్రతిదానిని శాస్త్రయుక్తంగా, తన స్వంత తర్కంతో, విజ్ఞాన సిద్ధాంతా లతో చెప్పుతూంటాడు. రక్త ప్రవాహాన్నిగూర్చి రసాయ నిక, ఖగోళ శాస్త్రాలనుగూర్చి అతనికి అతని స్వంతవుద్దేశ్యా లున్నాయి. అతను నెమ్మదిగా, దయా దాక్షిణ్యాలు, వుట్టి పడుతున్నట్లు, అతి ప్రశాంతంగా అరమోడ్పు కన్నులతో, ఎంతో బాధ, వ్యధతో చెప్పుతున్నట్లు, నిట్టూర్చుతూ, కరుణామూర్తిలా అప్పుడప్పుడు "ఆలోచించి చూడండి" అంటూ ఎంతోయిదిగా వప్పించటానికి ప్రయత్నిస్తూంటాడు.

ఆ విషయంలో అతని కత నేసాటియని చెప్పాలి. 50 సంవత్సరాల వయస్సులో వున్నవిషయం కూడా మర్చిపోయి యువకత్వంలో యున్నట్లు ఎంతో అందకాడయినట్లుగా ప్రవర్తిస్తూ యుంటాడు.

తరువాత వాళ్ళిద్దరూ భోజనానికి కూర్చున్నారు. లిప్టోవు ఒక గ్లాసు "ఓడ్కా", తరువాత "వైను" త్రాగాడు. ఫనర్వో ఏమీ త్రాగలేదు. అతనికి త్రాగుడూ, జూదంలాంటి అలవాట్లు ఏమీలేవు. కాని అతనిఆస్థి, భార్యా ఆస్థి ఆరితికర్వూరంలా హరించిపోయింది; అప్పులలో మునిగిపోయి వున్నాడు. అయినా డబ్బు ఖర్చుపెట్టటానికి ఏదోకటి అలాంటి దుర్గుణం మట్టుకు ఒకటుండాలని ఎక్కడుంది? పెద్దపెద్ద హోటళ్ళలో ఖరీదుగల భోజనంచేయటం, దానికితోడు సంగీతం, సలాములు గొట్టుతూవుండే సేవకులు అతనికి మహాయిష్టం. ఒక్కొక్కసారి వాళ్ళకు 10 లేక 25 రూబుళ్ళు యినుము పుచ్చుకోని ఘరానాగా పారవేయటం, లాటరీలు వేయటం, చందాలివ్వటం అతనికి మహాసరదా. తన స్నేహితులకు బహుమతులు పంపటం, కైలు, సిగరెట్టు కేసులు, సువాసన నూనెలు మొదలగువానికి డబ్బు ఖర్చు పెట్టటం అతనికి అలవాటు. అతను ధరించేబట్టలు, పయినించే పరుపులు, కొనే దుప్పట్లు ఎంత ఖరీదుగలవో చెప్పటం అనవసరం. అతని మాటలలోనే చెప్పాలనుకొంటే "వందలకు వందలు."

భోజనం తరువాత నిట్టూర్పు విడచి "అవును ప్రతి దానికీ యీ ప్రపంచంలో అంతంవుంటుంది. నీవు ప్రేమ గొడవల్లో పడతావు, బాధపడతావు, దానినుండి బయట

పడతావు. ఆమె నీవంటే అవిశ్వాసంగా వుండవచ్చు. అది స్త్రీ లక్షణం. కొంచెం యించుమించుగా బాధతో, వ్యధతో నీవు కూడ ఆమెఅంటే నిర్లక్ష్యంగా విశ్వాసంలేకుండా వుంటావు. చివరకవి అన్నీ మరపురాని అనుభవాలుగా మిగిలిపోయి, యిలా కూర్చొన్నప్పుడు మాట్లాడుకొనటం అంతా తెలివి తక్కువతనం అని వాపోవటం మట్టుకు జరుగుతూంటుంది" అన్నాడు.

లిప్టోవు ఫనర్వో తల, గడ్డంవంక తదేకదృష్టితో నిపాతో చూస్తూ అనేకమంది స్త్రీలు యీ అందమైన ఆడంబర సగర్వవ్యక్తి అంటే ఎందుకు పడిచస్తారో తన కిప్పుడు అర్థమై నట్లుగా తలంచాడు.

భోజనాల తరువాత ఫనర్వో తన యింటికి బయలు దేరాడు. లిప్టోవుకూడ అతనిని సాగనంపటానికి బయలు దేరాడు. ఫనర్వో ఒక్కడే ఆ టవునులో అలాంటి టోపీని కల్గియున్నది. ఆ టవునులో అతను,అతనిటోపీ చాలగమ్మత్తుగా, విచిత్రంగావున్నట్లుగా వున్నారు.

ఫనర్వోను కొంతదూరం సాగనంపి లిప్టోవు తిరిగి యింటికి బయలుదేరాడు. వెన్నెల పిండిఆరబోసినట్లుగా యున్నది. చివరకు గడ్డిపరకను కూడ చూడవచ్చును. చంద్రుడు అతని తలను ముద్దిడుకొంటున్నట్లుగా లిప్టోవు తలంచాడు.

"నే ప్రేమిస్తున్నా"నని బిగ్గరగా అన్నాడు. వెనుకకు తిరిగి పరుగెత్తుకొనివెళ్ళి ఫనర్వోను కౌగలించుకొని అతని తప్పులన్నింటినీ మన్నించి అతనికి చాలడబ్బు బహుమతిగా

యిచ్చి, అడవులలోనికో, పచ్చని చేలల్లోనికో పరుగెత్తి పారిపోయి మరల తిరిగి రాకూడదనుకొన్నాడు.

అతను యింటికి తిరిగి రాగానే, మర్చిపోయిన యూలియ గొడుగతని కంటపడింది. వెంటనే తీసుకొని, ఎంతో ఆనంద ఆవేశాలతో ముద్దెట్టుకొన్నాడు. అదేమంత ఖరీదు గలదిగాని కొత్తదిగాని కాదు. లిప్టోవు తెరచి పైన వేసుకొని కొన్ని క్షణాలపాటు, సర్వోతుల్యమైన సంతోషానందాలనుభవించాడు.

గొడుగు చేతిలో పట్టుకొని, కుర్చీలో కూర్చుని మాస్కోలోని స్నేహితునకు ఉత్తరం వ్రాయటం మొదలు పెట్టాడు.

ప్రియమైన కోస్టియా – నేనొక శుభవార్త వ్రాయదల్చుకొన్నాను. నేను మరల ప్రేమలోపడ్డాను. నేను "మరల" అని ఎందుకు వ్రాశానో తెలుసా మిత్రమా – 6 సంవత్సరముల పూర్వము నేనొక మాస్కో నటిని ప్రేమించాను. కానీ నేనెప్పుడూ ఆమెను కల్సుకొని మాట్లాడిన పాపాన పోలేదు. పోయిన సంవత్సరము నేనొక "స్త్రీ"తో గడిపాను. ఆమెను నీ వెరుగుదువు. ఆమె అంత అందమైనది గాని, పడుచుదిగాని కాదు. ఓ ప్రియమైన స్నేహితుడా – నన్నేమి చెప్పమంటావు. ప్రేమ గొడవలలో నేనెంతో దురదృష్టవంతుడననే చెప్పాలి. నేను స్త్రీల విషయంలో ఎన్నడూ విజయాన్ని సాధించలేకపోయాను. నేను "మరల" అని ఎందుకు వ్రాశానంటే నా వయస్సంతా ప్రేమించబడకుండానే గడచిపోయిందనే సిగ్గూ విచారంవల్లనే. ఈనాడు

34 సంవత్సరాల వయస్సులో ప్రేమ అంటే ఏమిటో తెల్సు కొనగల్గాను. అందువల్లే ఇది మరొకటి.

నీకు గనుక ఈ అమ్మాయి తెల్సియుంటేనా! అంత అందగత్తె ఏమీ కాదంటావు. సన్నగా వుంటుంది, కాని దయాదాక్షిణ్యాలు ఆమె ముఖంలో తొణికిసలాడుతూ వుంటాయి. ఆమె చిరునవ్వు ఎంత అందంగా యుంటుం దనుకొన్నావు? ఆమె గొంతుక ఎంత మాధుర్యంగా వుంటుంది. ఆమె నాతో ఎక్కువగా మాట్లాడదు. నేను కూడా, నాకామె బాగా తెల్సునని చెప్పలేను. కాని నేనామెతో యున్నప్పుడు నేనొక ఉన్నత అమూల్యమైన వ్యక్తితో వున్నట్లు తలంచుతాను. ఆమెకు దైవభక్తిమెండు. ఇది నన్నెంతవరకు ఆకర్షించిందో నీకు తెలియదు. ఆమె గుణగణాలను గూర్చి నీతో నేను గంటలు, గంటలు నిస్సం దేహంగా, నిర్భయంగా చెప్పగలను. నీ అభిప్రాయం నీకుండ వచ్చు. నాకేమీ అభ్యంతరంలేదు. ఆమె అలా చర్చిలో ప్రార్థనచేస్తూ యుండగా చూస్తూండటం నాకు మహా యిష్టం. ఆమె ఒక అనాగరిక ప్రాంతంలో పుట్టి వుండవచ్చు. కాని ఆమె చదువుకొన్నది మాస్కోలో. ఆమె బట్టలుకూడా మాస్కో ఫ్యాషనులోనే ధరిస్తుంది. నేనామెను ప్రేమిస్తున్నాను. అవును, నాకు తెల్సు. నీవు కోపంతో లెగిసి ఎవరిని ప్రేమిం చాలో, ఎవరిని ప్రేమించకూడదో మొదలగు విషయాలపైన ఉపన్యాసంఇవ్వ సిద్ధంగా వున్నావుగదూ. కాని ప్రియమైన కోష్టియా – నేను ప్రేమలోపడ్డతర్వాతే ప్రేమ అంటే ఏమిటో తెల్సుకొనగల్గాను.

అక్క తన దీవెనలని చెప్పమన్నది. ఇప్పటికీ ఆమె నిన్నలా వీధిబడిలోనికి తీసుకొని వెళ్ళుతూండేదో చెబుతూం టుంది. ఆ విషయాలు అన్నీ ఆమెకు ఇప్పటికీ బాగా జ్ఞాపకమున్నాయి. ఇప్పటికీ నిన్ను ఆమె "పాపం కోష్టియా" అని అంటూంటుంది. ఆమెదృష్టిలో ఇప్పటికీ నీవు అనాథ బాలుడవే. ఓ|ప్రియమైన అనాథ బాలుడా, నేను ప్రేమిస్తు న్నాను: ఇది ఇంతవరకు నే నెవరితో చెప్పలేదు. నీవుకూడా రహస్యంగానే వుంచు, అనుమానించే ఏవ్యక్తికీ చెప్పకు. నీవు హాయిగా స్థిరపడిపోయా వనుకుంటా. టాల్‌స్టాయి నవలలో నాకకు చెప్పినట్లు-"ప్రతిదీ దానంతటదే....."

ఉత్తరం వ్రాయటం పూర్తి అయిన తరువాత నిద్రపోవ టానికి వెళ్ళాడు. అతని కనురెప్పలు అలసటతో చాలా బరు వుగా వున్నాయి. కారణమేమిటోగాని నిద్రమట్టుకు పట్టలే దతనికి. బజారులో గల్లంతువల్ల, పశువులు బయటకువదుల్తున్న శబ్దంవల్ల నిద్రపట్టటంలే దనుకొన్నాడు. చర్చి గంటలు, సామానుతో బండిలో మార్కెట్టుకు బయలుదేరి వెళ్ళుతున్న రైతు భార్య గొంతుక వినిపించాయి. పక్షుల కిలాకిలా రావంతో ప్రపంచంఅంతా నిండిపోయింది.

# 2

ఆరోజు ఉదయం ఎంతో అందంగా వుంది. షుమారు 10 గం॥ లకు నైన క్రొత్త బట్టలు కట్టుకొని, తల దువ్వుకొని

బయట గదిలో కూర్చొనియున్నది. గదిలో కొద్దిసేపు అటూ, ఇటూ తిరిగి తెరచియున్న కిటికీముందు నుంచుని చిన్నపిల్లలా నవ్వుతూ బయటకు చూస్తూన్న 'నైన'కు, ఒకనాడు త్రాగుడంటే పడిచచ్చే కళాకారుడు తన ముఖం దేవత ముఖంలా వుంటుందని, తనకు యిష్టమైతే అతడా ముఖాన్ని చిత్రించుతానని అన్న మాటలు గుర్తుకు వచ్చినాయి. ఆ ఉదయం ప్రతివారు-పిల్లలు, నౌకర్లు, అలెక్సీ అంతా 'నైన' మరల ఆరోగ్యవంతురా లగుతుందని తలంచారు. పిల్లలు ఆనందంతో నవ్వుతూ, మేనమామచుట్టూ తిరుగుతూ ఆడుకొంటూ గల్లంతు చేస్తున్నారు. చాలకాలం తరువాత ఆ యిల్లు కళకళలాడటం యిదే మొదటిసారి. చాలమంది ఆమెను చూడటానికి, యోగక్షేమాలు కనుగొని వెళ్ళటానికి వచ్చిపోతున్నారు. ఆమె ఆరోగ్యంకొరకు చర్చిలో ప్రార్థనలు జరిపారు. దయాదాక్షిణ్యాలకు ఆమె హృదయం పుట్టినిల్లు. అందువల్లనే అందరికీ ఆమె అంటే అంత ప్రేమాదరాభిమానాలు. తన సోదరుడు అలెక్సీవల్లే ఆమెకూడ వెనుకాముందూ ఆలోచించకుండా నిస్వార్థంగా, రేపుఎలా గడుస్తుంది అనే తలంపులేకుండా, అడిగినవారికి లేదనకుండా దానం చేయటం ఆమెకు అలవాటు. పేదవారి పిల్లలు చదువుకొనడానికి ఆమె జీతంకడుతూంటుంది. పేదముసలివారికి "టీ" పంచదార పంపుతూంటుంది. డబ్బులేని పెళ్ళికూతుళ్ళకు అన్నివిధాలా సహాయంచేసి వాళ్ళను ఒక యింటివాళ్ళనుగా చేస్తుంది. అసలు యింటికి వార్తాపత్రిక రావటంతోనే, ఎవ

రైనా సహాయానికి అర్థిస్తున్నారా? ఎవరైనా బాధలలో వున్నారా? మొదలగు ప్రకటనలకొరకు ఆమె వెతికేది.

ఇప్పుడుకూడ ఆమె చేతిలో పేదవాళ్ళు అప్పుగా వంటసామానులు తెచ్చుకొన్న దుకాణదారునకు డబ్బు చెల్లించటానికి చెక్కులున్నవి.

"అబ్బ, ఎంతడబ్బు ఖర్చుపెట్టావు? యింతడబ్బు ఖర్చు పెట్టినట్లు వాళ్ళకు తెలుసునా?" అంటూ చెక్కులమీద అతి కష్టంతో సంతకంచేస్తూ "82 రూబుళ్ళు, సామాన్యమా? నేను యివ్వకపోతే" అన్నది.

"నేను యిస్తాను యీరోజు" అన్నాడు లిప్టోవు.

"ఉహుం, నీవు యివ్వవద్దు" అని అన్నది నైన. కలవర పడుతూ "నీవు, ఫాయిడకు కలిసి ప్రతినెలా 250 యిస్తున్నారు. అంతేచాలు. మీకు దేవుడు సహాయం చేయుగాక" అని అన్నది నైన నెమ్మదిగా నౌకర్లకు వినిపించకుండా.

"మరి నేను నెలకు 2500 ఖర్చు పెడుతున్నాను... నేచెప్పేది విను. మా యిద్దరకు యీ డబ్బుమీద ఎంతహక్కు వున్నదో నీకూ అంతే హక్కు వున్నది. ఈ విషయం నీకు తెలుసుననుకొంటా నక్కా. మనం ముగ్గురం ప్రతిమూడు కోపెక్కులలోను ఒకటి నీదే.న్న విషయం నీవు గుర్తుంచు కోవాలి" అని అన్నాడు లిప్టోవు.

'నైన'కు యిది అంతా ఏమీ అర్థమయినట్లుగా లేదు. ఇంత పెద్దలెక్క ఆమెకు చాల అగమ్యముగా వున్నట్లు ఆమె ముఖం చెబుతూంది. ఆమెకు డబ్బువిషయం ఎప్పుడూ అర్థంగాకుండా వుండటంచూస్తే లిప్టోవుకు చాల కష్టంగా

వుంటుంది. ఆమెకు ఏవో రహస్యంగా అప్పులు వుండివుంట వని చెప్పటానికి సిగ్గుపడుతూ తనలో తాను చాల బాధపడు తూందని లిప్టోవు నమ్మకం.

అలాంటి సమయంలో ఎవరో ఆయాసపడుతూ మెట్లెక్కుతున్న చప్పుడయింది. ఆ వచ్చేది డాక్టరుగారు, మామూలుగానే వచ్చారు.

"రురూ, రురూ" అని పాడుకొంటూ వున్నారు డాక్టరుగారు.

డాక్టరును కలుసుకొనటానికి యిష్టంలేక లిప్టోవు యిం కొక గ్రోవను తన గదిలోనికి వెళ్ళాడు. అతనికి డాక్టరుతో అంత పరిచయం లేదు. దానికితోడు ఆ తెలివితక్కువ దద్దమ్మతో మాట్లాడటం అంటే అతనికి పరమ అసహ్యం. అందువల్లనే యూలియ అంటే అనురాగం వున్నప్పటికీ, చాల తక్కువగా వాళ్ళయింటికి వెళుతూండేవాడు. డాక్టరుగారు యిచ్చట వుండటంవల్ల యూలియ యింటివద్ద వంటరిగానే వుంటుం దనే ఆలోచన అతనికి తట్టింది. హృదయం సంతోషానందా లతో గంతులేసింది. అతను త్వరగా వెళ్ళాలి-వెళ్ళాలి. పరు గెత్తుకొని వాయుమేఘాలలో వెళ్ళాలి.

అతను గొడుగును తీసుకొని ప్రేమపక్షిలా పరు గెత్తాడు. బయట చాలవేడిగావుంది. ప్రక్కయింటిపిల్లలు డాక్టరు యింటిముందువున్న ఖాళీ ప్రదేశంలో ఆడుకొంటూ వున్నారు. కేకలతో, నవ్వులతో ఆ ప్రదేశం అంతా నిండి యుంది. యూలియ వరండాలో చేతులు వెనుకపెట్టుకొని నిల్చొని పిల్లలు ఆడుకొంటూంటే చూస్తూంది.

"ఏమండీ, బాగున్నారా ?" అని ప్రశ్నించాడు లిఫ్టోవ్.

ఆమె అతనివైపుకు తిరిగి చూసింది. సాధారణంగా ఆమెముఖం అలసిపోయినట్లుగా, అదోకరకంగా వుంటుంది. కాని యిప్పుడు ఆడుకొంటున్న చిన్న పిల్లల ముఖంలా ఎంతో సంతోషంగా వుంది.

"చూడండి. మాస్కోలో యిలాంటి ఆటలు మీ రెప్పుడైనా చూశారా ?" అంటూ అతనిని కల్సుకోనడానికి ముందుకువచ్చి "సాధారణంగా అచ్చట యిలా, యిళ్ళముందు ఖాళీ స్థలమేవుండదు. నాన్నగారు యిప్పుడే మీ యింటికి వెళ్ళారు" అన్నది పిల్లవంకచూస్తూ.

"నాకు తెల్సు. నేను మిమ్ములను చూడడానికివచ్చాను గాని, మీ నాన్నగారినిగాదు" అన్నాడు లిఫ్టోవ్. ఆమె కన్యాత్వాన్ని, బంగారుగొల్సుకల్గియున్న ఆమె తెల్లని సన్నని మెడను తనలోతాను మెచ్చుకొంటూ. "నేను మిమ్ములను చూడడానికే వచ్చాను. మీ గొడుగు యిదిగో. మా అక్క మీకు యివ్వమని చెప్పింది. నిన్న మీరు మా ఇంటివద్ద మర్చిపోయారట" అన్నాడు మరల.

ఆమె అందుకోడానికి చేయిచాచింది. కాని లిఫ్టోవ్ దానిని యివ్వకుండా హృదయానికి హత్తుకున్నాడు.

"దయుంచి నన్ను వుంచుకోనసీయండి. గుర్తుగా... మన స్నేహ చిహ్నంగా. చాల బాగుంది" అన్నాడు ఆవేశంతో తడబడుతూ.

"అలాగే వుంచుకోండి" సిగ్గుతో మరల "అదేమీ అంత మంచిది, క్రొత్తదిగాదు" అన్నది.

తెలియని తన్మయత్వంతో, నిశ్శబ్దంగా ఆమెవంక చూస్తూ నిల్చొనిపోయాడు. మాట్లాడటానికి మాటలు దొరకడంలేదు.

"అయ్యో అదేమిటి మిమ్ములను అలానే ఎండలో నిల బెట్టాను" అని అన్నది కొంతసేపు నిశ్శబ్దంగా వుండి. తరువాత నవ్వుతూ "లోపలకు రండి" అని లోపలకు ఆహ్వానించింది.

"మీ పనికేమీ అడ్డంరావడంలేదుగదా."

వాళ్ళు యిద్దరూ లోపలికి వెళ్ళారు. యూలియ పైకి ఎక్కుతూవుంటే, ఆమె తెల్లని దుస్తుల శబ్దం వినిపించుతూంది.

"నా పనులు పాడుచేయడం యితరులకు అసాధ్యమైన పని" అని జవాబిచ్చి పైకివెళ్ళబోతూ "నాకెప్పుడూ, ఏమీ పనివుండదసలు. కాబట్టి నేనెప్పుడూ ఏమీ చేయడం జరగదు. ప్రతిరోజూ నాకు సెలవే" అన్నది.

"నాకు అర్థంగాని విషయాలలో అదొకటి" అంటూ ఆమెవద్దకు వెళ్ళి "నేను ఆడ, మొగ, ప్రతినిత్యం పనిచేసే వాళ్ళలో పుట్టిపెరిగా" నన్నాడు.

"చేయడానికి ఏమీ లేనప్పుడేమి చేయాలిమరి."

"ప్రతి ఒక్కరూ ఏదొకపని కల్పించుకొనైనాసరే చేయటాని కనువుగా జీవితమార్గాన్ని అలవర్చుకోవాలి. ఏదొక పనిచేస్తూ వుండటం జీవితధర్మం. పనిలేని జీవితంలో సంతోషం ఏముంది" అంటూ మరలొకసారి గొడుగును హృదయానికి హత్తుకొని, అతనికతనే తరువాత ఆశ్చర్యం వేసే విధంగా, నమ్మలేనట్లుగా "నీవుగనుక నా సహచరిణి వవ్వ టానికి వప్పుకుంటే నా సర్వస్వం నీ పాదాలవద్ద ధార

పోస్తా ........సర్వం.........నే చేయని త్యాగమంటూ వుండదు" అన్నాడు.

ఆమె తృళ్ళిపడి అతనివంక భయ సంభ్రమాలతో చూసింది.

"ఊహుఁ—" ముఖం తెల్లబడింది. "క్షమించాలి.... అది ఎన్నటికీ జరుగదు. క్షమించండి" అన్నది.

ఆమె పైకి పరుగెత్తి తలుపుచాటున మాయమైంది.

జీవితం కాంతివిహీనమైనట్లు వెంటనే అతని హృదయ స్థితి మారిపోయింది. తొందర తొందరగా యింట్లో నుండి బయటకు నడిచాడు. సిగ్గుతో, అవమానంతో, అవమానించ బడ్డాననే, నిరాకరించ బడ్డాననే, అనాకారిననే తలంపులతో అతనిహృదయం దహించి పోయింది. క్షోభతో కుమిలిపోయింది.

"నా సర్వంయిస్తా, నా సర్వం యివ్వదల్చుకొన్న... వ్యాపారిలా. ఎవరో సర్వం కావాలన్నట్టు......" అతని మాటల కతనే అసహ్యించుకొన్నాడు. తీక్ష్ణమైన ఎండలో నడుస్తూ తననుతానే ద్వేషించుకొన్నాడు.

అతను చెప్పిన ప్రతి విషయం, అతనెంతో గర్వంగా పల్కిన ప్రతి పలుకు, అతని తెలివితక్కువతనాన్ని, మూర్ఖత్వాన్ని బయటపెట్టాయి. ప్రతి నిత్యం పనిచేసి బ్రతికే కుటుంబంలో పుట్టి పెరిగానని అతనెందుకు అబద్ధం ఆడాలి ? జీవితం గురించి ఎంతో వేదాంతిలా ఎందుకు ఉపన్యాసం యివ్వాలి ? అది అంతా అతని తెలివితక్కువతనం, నాటకం కూడాను. మాస్కో బూటకాలలో ఒకటి. శిక్షవిన్న తరువాత నేరస్థుని మనస్థితిలో ఎలాంటి మార్పు వస్తుందో అలాగే

"లిప్టోవు" స్థితి కూడావుంది. అతని అనుమానం తీరిపోయింది. ఎంతో బరువు తీరిపోయినట్లుగా తలంచాడు. దానికి దేవుని కెంతో కృతజ్ఞత తెల్పాడు. అతనికి జీవితంలో ఆశగాని, ఆనందంగాని, సుఖంగాని ఏమీ లేవు. జీవితపు నిస్పృహా, నిరాశలనుండి బయటపడటానికి ఇతరులకు సహాయం చేయటం, వాళ్ళ ఆనందాన్ని చూసి సంతోషించటం, ఆనందించటమే అతనికి మిగిలిందల్లా. అతనికి తెలియకుండగానే ముసలితనం వస్తుంది. ఒకనాడు సర్వం పూర్తి అవుతుంది. జరిగినదానిని నిష్పక్షపాతంగానే ఆలోచించాడు. కాని అతని హృదయభారం మట్టుకు తగ్గలేదు. ఆలోచనలతో, తలనొప్పి బద్దలుగొట్టుకు పోతూంది. కనురెప్పల క్రింద చాలా బరువుగా వుంది. కన్నీరు కాల్వలుగా కారనున్నవా అనిపిస్తుంది. చాలా బలహీనంగా వున్న వ్యక్తిలా కన్పిస్తున్నాడు. మంచంపై బడ్డ అయిదు నిముషాలకే పూర్తిగా నిద్రపోయాడు.

## 3

లిప్టోవు అలా గమ్మత్తుగా వివాహ ప్రసక్తి తేవటం "యూలియాకు" కూడా చాలా బాధను కల్గించింది.

లిప్టోవును ఆమె అంత బాగా ఎరుగదు. ఒకనాడు గమ్మత్తుగా వాళ్ళిద్దరూ కల్సుకోవడం జరిగింది. అతను చాల ధనవంతుడు. మాస్కోలో "ఫాయిడర్ లిప్టోవు అండ్ సన్సు" వ్యాపారస్థుని కుటుంబంలోనివాడు. ఎప్పుడూ అరాకరకంగా

వుంటాడు, సరదాగా నవ్వుతూనేవుండడు. చాలా తెలివిగల వాడు కూడాను, అక్క ఆరోగ్యంగూర్చి ఎక్కువగా బాధ పడుతూవుంటాడు. అతనికి, తనంటే అలాంటి అభిప్రాయం వుందని యూలియ కలలోకూడా అనుకోనలేదు. "యూలియ"కు కూడా "లిప్టోవ్" అంటె అలాంటి తలంపు ఎప్పుడూ కలుగలేదు. ఇప్పుడు మెట్లమీద అతని ప్రస్తావన, జాలి గొలిపే అతని ముఖం...

అంత అకస్మాత్తుగా, అతను ఆమెను అడగడం, వెంటనే ఆమె నిరాకరించడం, అన్నీ అనుకోకుండా అంత తొందరలో జరగటం, ఆమెకుకూడా కష్టంగానేవుంది. ఏమిచెప్పిందో సరిగా ఆమెకు ఇప్పటికీ గుర్తులేదుగాని, అయిష్టభావంమట్టుకు ఆమెలో మెలగుతూనేవుంది. అతనంటే ఆమెకెప్పుడూ పెద్దగా యిష్టంలేదు. ఆమెకతడు బేరగాడుగా కన్పించాడు. అతనంటే అభిమానంకూడా లేదు. అతనిని వివాహమాడటానికి వప్పుకొని వుండేదిగాదు. కాని జరిగిపోయిన దానినిగూర్చి అదోకరకంగా బాధపడుతూవుంది.

"ఓ దేవుడా...మెట్లమీదనే, కనీసం గదిలోకయినా వెళ్ళకుండా" అని నిస్పృహతో తనలో తాననుకుంటూ, గోడను వ్రేలాడుతున్న ఏసుప్రభువు పటంవైపు తిరిగి "ఒకరి నొకరం కల్సిమెల్సి తిరిగి, అర్థంచేసుకోనకుండానే...అర్థంలేదు" అన్నది.

ఆమెలో కలవరం గంట గంటకు ఎక్కువవుతూవుంది. ఎవరితోనో ఒకరితో మాట్లాడి, తను చేసినది మంచో, చెడో తెల్సుకొనేవరకు, ఆమెకు ప్రశాంతతగాని. యూరటగాని

వుండదు. కాని ఇలాంటి విషయాలు మాట్లాడడానికి, కష్ట సుఖాలు చెప్పుకోడానికి ఆమె కెవరూ లేరు. తల్లి ఏనాడో చనిపోయింది. తండ్రితో ఇలాంటి విషయాలు చర్చించటం ఆమె కెప్పుడూ యిష్టముండదు. తండ్రి గోరంతదానిని, కొండంతగా తీసుకొనే వ్యక్తి. ఆయనంటేనే ఆమెకు అదొక రకమైన భయం. అదియుగాక, "యూలియ" ఏమైనా చెప్పనీ వినకుండానే సంపూర్ణముగా తన గొడవ చెప్పుకుపోతాడు.

"టీ" తయారుగా వుంది. "యూలియ" అలసి, నిస్సహాయురాలుగా వున్నట్టుంది. భోజనాలగదిలోకివచ్చి ఒక కప్పులో "టీ" తనకు పోసుకొని రోజులాగానే, తండ్రికి మరొక కప్పులో పోసియిచ్చింది. డాక్టరుగారు మోకాళ్ళ వరకూ వచ్చేకోటుతో, ఎర్రని ముఖంతో, అపరిశుభ్రంగా, చేతులు కోటుజేబులో పెట్టుకొని, బోనులోవున్న జంతువులా భోజనాల గదిలోనికి అడుగుపెట్టారు. ఆగి ఆగి చప్పుడుచేస్తూ "టీ" త్రాగుతూ అదొకరకంగా కూర్చున్నారు.

"లిప్టోవు నన్ను తన్ను వివాహమాడమని అడిగాడు నాన్నా" అంది యూలియ సిగ్గుపడుతూ.

డాక్టరు తలఎత్తి ఏమీ అర్థంగానట్లుగా కూతురువంక చూశాడు.

"లిప్టోవ్ నైనా తమ్ముడా ?"

డాక్టరు కూతురుని విపరీతంగా ప్రేమిస్తాడు. అతనికి తెల్సు ఈరోజు కాకపోయినా, మరొకనాడయినా ఆమె ఎవరినో ఒకరిని వివాహమాడి తనను వదలి వెళ్ళిపోతుంది. కాని ఆ విషయంగూర్చి ఆలోచించడం ఆయనకంత యిష్టముండదు

అతను ఒప్పుకోనకపోయినా అంత పెద్ద యింటిలో వంటరిగా వుండటమంటే అతనికి భయం. అలా వుండటం జరిగితే అతనికి మూర్ఛ వస్తుందనినమ్మకం. కానీ ఈ రహస్యాలు ఎవ్వరికీ చెప్పడు.

"మంచిదే, చాలా సంతోషకరమైన సంగతి. హృదయ పూర్వకంగా నిన్ను దీవిస్తున్నాను. ఇప్పటికి నన్ను వదలిపోవ టానికి నీకు సదవకాశం దొరికింది. ఆ విషయంలో నీవే రైటుకూడా. నీలాంటి యువతికి నాలాంటి తండ్రితో, జబ్బుతో చావసిద్ధముగా వున్న ముసలిపీనుగతో వుండటం చాలా కష్టం కూడాను. నీ ఉద్దేశ్యమే మంచిది. ఎప్పుడోఒకప్పుడు ఈ జీవుడు కాస్తా వెళ్లిపోతాడు. అన్ని సమస్యలు తీరిపోతాయి. దాని కొఱకు నేను ఎదురు చూస్తున్నాను. నీకు సుఖం కలుగజేయా లని దేవుని ప్రార్థిస్తున్నానమ్మా."

"నేను అంగీకరించలేను."

డాక్టరు హృదయం చాలా తేలికపడింది. కానీ మాట్లాడ కుండా వుండలేకపోయాడు.

"నన్ను పిచ్చి ఆస్పత్రిలో ఎందుకు చేర్చలేదా అని చాలాసార్లు ఆశ్చర్యపడుతూ వుంటాను. నే నిలాంటి కోటు ఎందుకు ధరించుతున్నానని. నా కిప్పటికీ నిజాయితీలోను, మంచితనంలోను నమ్మకంవుంది. అలాంటి వాటిల్లో నమ్మకంగల మూర్ఖుడిని. ఈకాలంలో అలాంటి ఉద్దేశ్యాలు కలిగుండటం తెలివితక్కువతనం, పిచ్చివాని లక్షణంకదూ. న్యాయంగా ప్రవర్తించటంవల్లను నిజం చెప్పటంవల్ల, నేను సంపాదించే దేమిటి. నా యీ పిచ్చితనాన్ని ఆసరాగా తీసుకొని ప్రజలు

రాళ్లురువ్వ సిద్ధంగా వున్నారు. చివరకు దగ్గర బంధువులు కూడా నా మెడపైనెక్కి స్వారీచేయాలనుకుంటున్నారు. నిజముగా ఎందుకూ పనికిరాని మూర్ఖపు ముసలిపీనుగను నేను."

"నీతో మాట్లాడటం చాల కష్టంనాన్నా" అంది యూలియ.

యూలియ లేచి కోపంతో తన గదిలోనికి వెళ్ళిపోయింది. అతను చాలాసార్లు ఆమెను అన్యాయం చేశాడు. యూలియకు కోపం వచ్చినా తండ్రి అంటే జాలిపడటం, తరువాత సహాయముగా వుండటం జరుగుతూ వుంటుంది. ఈనాడుకూడా అతను క్లబ్బుకు వెళుతూన్నప్పుడు గడప వరకూ సాగనంపి, తలుపువేసి తిరిగివచ్చింది. గాలి జోరుగా వీస్తూ వుంది. ఆమెకు నిద్రపట్టకుండా వుంది. గాలికి కిటికీ తలుపులు కొట్టుకొంటున్నాయి. దీపం ఆరిపోయేటట్లున్నది. భయపడుతూ దేవుని ప్రార్థిస్తూ ప్రతి గదిలోనికివెళ్ళి తలుపులు వేసింది. ఇంటి కప్పుపైన ఎవరో నడుస్తున్నట్లుగా భయపడింది. కాలం చాలా నెమ్మదిగా నడుస్తున్నట్లుగా తలచింది. ఆమె తానంత వంటరిదానినని ఎప్పుడూ యింతకుముందు తలంచ లేదు.

లిప్టోవ్ అందగాడు కానంతమాత్రాన, కాదనటం మంచిదా అని తనలోతాను ప్రశ్నించుకుంటూ వున్నది. ఆమె అతనిని ప్రేమించటములేదు. నిజముగా ఆమె అతనిని వివాహమాడటం జరిగితే ఆమె ఊహలు, ఆశలు, కోరికలు, అనురాగటానందపు భవిష్యత్తును గురించి కన్న కలలకు స్వస్తి చెప్పవలసిందే. తను అనుకొంటున్న ప్రేమైక వైవాహిక జీవితానికి

తిలోదకాలు వదలవలసినదే. కాని ఆమె ఊహించుకొన్న వ్యక్తిని జీవితంలో పొందగలదా? ఇప్పుడామె వయస్సు 21 సంవత్సరాలు. ఆమె వయస్సుకు తగిన వరుడు ఆ పట్టణంలో లేడు. ఆమెకు ఆ పట్టణంలో కొందరు ఉద్యోగస్తులు తెలుసు. వాళ్ళకు పెళ్ళిళ్ళు అయి కొంతమంది నిస్సారంగా యీసురోమంటూ ఎందుకువచ్చిన జీవితంరా అంటూ బ్రతుకుతున్నారు. కొందరు ప్రేమ విహీనంగా, అవిశ్వాసముగా, మూర్ఖంగా, చాలా అవినీతిగా బ్రతుకుతున్నారు. లిప్టోవు మాస్కో వ్యక్తి. అచటి యూనివర్సిటీలో చదువుకొన్నాడు. ఫ్రెంచి బాగా మాట్లాడగలడు. ఎంతోమంది విద్యావంతులతో జీవితం ఎంతో సరదాగా గడపటానికి అనువుగా మాస్కోలో నివసిస్తూంటాడు. బైబిలులో భార్య భర్తను ప్రేమించాలనివుంది. అనేక నవలల్లో కూడా అదేవిషయాన్ని అనేకమార్లు చెప్పారు. అది అంతా గోరంతను కొండంతచేసి చెప్పట మనుకొంటా. ప్రేమ లేకుండా పెండ్లి సాధ్యం కాదా? ప్రేమ కొంతకాలానికి పోతుందని, అలవాటు మట్టుకు మిగులుతుందని ఎవ్వరూ అనలేదా? పెండ్లి ప్రేమించటానికి, ఆనందించటానికి కాదు. విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించటానికి. ఉదాహరణకు పిల్లలను కనటం, పెద్దవాళ్ళను చేయటం, ఇల్లు కనిపెట్టుకుండటం మొదలగు ధర్మాలను నిర్వర్తించటానికి. బైబిలులో చెప్పబడిన ప్రేమ అంటే బహుశా గౌరవము, ఓర్పు, పొరుగువారిని ప్రేమించినట్లు భర్తను ప్రేమించటమేమో!

యూలియ నిద్రపోబోయేముందు తనకు సహాయం చేయమని దేవుని ఎన్నో విధాలుగా ప్రార్థించింది.

ఒకనాడు అవకాశం వుండి పెండ్లాడవచ్చిన వారిని కాదని, పెండ్లికాకుండా ముసలివార్తైన తరువాత పశ్చాత్తాపపడ్డ అనేకమంది స్త్రీలు ఆమెకు గుర్తుకు వచ్చారు. అలాంటి దామెకు జరగకపోవచ్చు. బహుశా ఆమె సన్యాసిగా జీవితం గడపవలసి వస్తుందేమో! ఇలాంటి ఆలోచనలతో నిద్రపట్టక సతమతమవుతూవుంది.

ఎవరో తలుపు కొట్టినట్లుగావుంది. "ఓ భగవంతుడా" అన్నది, బాధగా మంచంపైనుండి లెగవకుండగనే. అచ్చటి జీవితం ఎంతో విసుగుగా "బోరింగు" గా వున్నదామెకు. ఎప్పుడూ ఎవరో ఒకరు వస్తూవుండటం, ఏదో ఒకటి జరగటం, భయపడటం, కోపగించుకొనటం, ఏదోచేయరానితప్పుచేసినట్లు భయముతో దుప్పటి కప్పుకొని పండుకొని వుండటం జరుగుతూవుంటుంది.

మరల తలుపువద్ద శబ్దం విన్నది. పని మనుష్యులు నిద్రపోతూండి విని వుండరని యూలియ క్రిందకుదిగి వస్తూండగా పనిమనిషి తలుపువేసి ఎదురుగా వస్తూంది.

"నేను అయ్యగారనుకొన్నా, కాని అది ఎవరో" అంది పనిమనిషి.

"యూలియ" తన గదిలో'నికి తిరిగివచ్చి అచ్చటున్న పేక తీసుకొని అడుగుముక్కగనుక ఎరుపుదైనట్లయితే తాను "బిప్టోవు"ను వివాహమాడదలచినట్లు, నలుపుముక్క అయితే

అనంగీకారమని అనుకొని పేక కలిపి కోయగా వచ్చిన అడుగు ముక్క ఇస్పేటుపది.

ఇది ఆమెకు కొంత ప్రశాంతతను కల్గించింది. కొద్దిగా నిద్రకూడా పట్టింది. కాని మరల తెల్లవారి అదేసమస్య. అంగీకరించటమూ, అంగీకరించకపోవడమూ ఇప్పటికిప్పుడే ఆమె కావాలనుకొన్న జీవితాన్ని మార్చుకొనవచ్చు. దానినిగూర్చి ఆలోచించి, ఆలోచించి జబ్బుపడ్డ వ్యక్తిలా అలసిపోయింది. షుమారు 11 గంటల తర్వాత "నైన"ను చూడాలని బయలు దేరింది. అసలు ఉద్దేశము "లిప్టోవు" ను చూడాలని. ఆమె దృష్టిలో ఇప్పుడతనికి విలువ పెరిగి వుండవచ్చు, బహుశా ఆమె పూర్వం అతనిని తప్పుగా అర్థం చేసుకొన్నదేమో!

గాలి దుమారంలో తన టోపీ చేతితో పట్టుకొని దుమ్ము కళ్ళల్లో పడుతూ వున్నప్పటికి నడచి యూలియ నైన ఇంటిక్కి వెళ్ళింది.



# 4

యూలియ అనుకోకుండా అలా నైన గదిలోనికి రావటముతో లిప్టోవు తను నిన్నటివలెనే అవమానించబడినట్లుగా బాధపడ్డాడు. నిన్నంత జరిగినప్పటికీ యూలియ ఏమి ఎరుగు నట్లు తనచ్చటున్నా లెక్కచేయకుండా నైన గదిలోనికి రావటము లిప్టోవుకు చాలా కష్టము కల్గించింది. యూలియకు తనంటే లెక్కలేదని చాలా తేలిక అభిప్రాయం వుండివుంటుందని

తలంచాడు. కాని ఆమెతో కరచాలనము చేసినప్పుడు విచార కరమైన ఆమె చూపులు, కాళ్ళక్రింద దుమ్ము, బాధగా పశ్చాత్తాపపడుతున్న ఆమె వైఖరినిబట్టి ఆమెకూడ నిన్నటి విషయముగూర్చి బాగా బాధపడుతున్నట్లుగా తలంచాడు.

ఆమెకుకూడా అచ్చట కూర్చొనటం అదోకరకంగా వుంది. 10 నిముసాల తర్వాత వెళ్ళ తయారయింది. "మా యింటివరకు నన్ను పంపించ వస్తావా అలెక్సీ"? అని అడిగింది యూలియ లిప్టోవును, బయటకు నడుస్తూ.

వారిద్దరూ టోపీలు చేతిలోపట్టుకొని ఒకరితోనొకరు మాట్లాడకుండా నడచి వెళ్ళతున్నారు. లిప్టోవ్ ఆమెకు గాలి తగులకుండ కొంచెం వెనుకగా నడుస్తున్నాడు. వాళ్ళు ప్రక్క గొందిలోనికి తిరుగగానే గాలి కొంచెంతగ్గింది. ఒకరిప్రక్కన ఒకరు నడవటం మొదలుపెట్టారు

"నిన్న నేను చాలా అసహ్యముగా అనుచితముగా ప్రవర్తించాను. క్షమించండి" అంటూ మొదలుపెట్టింది. ఏడవటానికి సిద్ధముగా వున్నట్లుగా వుంది. "నాకు జీవితములో సుఖము ఏమీ లేదు. రాత్రంతా నిద్రపట్టనేలేదు. ఏమిటో ఆలోచనలతో గడచిపోయింది" అన్నది.

"నిజంగానే. నేను చాలాహాయిగా నిద్రపోయానే" అన్నాడు లిప్టోవు ఆమెవంక చూడకుండగనే. "కాని నేనెంతో సంతోషముగా, హాయిగా వున్నాననిమట్టుకు తలంచకు. నేను సుఖపడాలి, సంతోషముగా, హాయిగా జీవించాలనే ఆశ ఏనాడో సన్నగిల్లింది. నిన్నటినుండి ఆ ఆశ పూర్తిగా దూర మయింది. విషం త్రాగినట్లుగా వుంది. జరుగవలసినదేదో

నిన్ననే జరిగిపోయింది. ఇప్పుడు నేనుస్వతంత్రుడను, ఆశా లేదు, నిరాశా లేదు, నా కిప్పు డే భావనా లేదు. నిజం చెప్పుతున్నా. నిన్ను నేను నా అక్క కన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నా. తల్లికన్నా ఎక్కువగా...నేను మా అమ్మ, మా అక్క, లేకుండా బ్రతుక గలను, కాని నీవు లేకుండా ఒక్క క్షణం కూడా బ్రతుక లేను. నీవు లేని నా జీవితానికి అర్థం లేదు. నిస్సారం, నిస్పృహ తప్ప మ రేమీ లేదు. నేను....."

మామూలుగానే లిప్టోవు ఆమె వుద్దేశ్యాలను ఊహిం చాడు. ఆమె తనను ఇంటివరకు పంపించటానికి రమ్మన్న కార ణము, నిన్న జరిగిన సంభాషణను గూర్చి మాట్లాడటాని కని అతనికి తెల్సు. నిన్న కాదని, ఈరోజు దానికితోడు మ రేమి చెప్పుతుంది? ఇప్పు డామె వుద్దేశ్యం ఏమిటి? ఇప్పుడేమయినా మార్పువచ్చిందా ? ఆమె చూపులు, నవ్వును బట్టి, ఆమె అతని ప్రక్కన నడిచే విధానాన్నిబట్టి ఇప్పటికీ ఆమె తనను ప్రేమిం చటం లేదని తలంచాడు. అయితే అలాంటప్పు డామె చెప్పదల్చు కొన్న దేమిటి, తనకు ?

డాక్టరు ఇంటివద్దనే వున్నాడు.

"రా, లోపలికి రా...అలక్సీ". లిప్టోవ్ పేరుతో పిలవ టానికి కంగారుపడి "నిన్ను చూడటం నాకు చాలసంతోషంగా వున్నది రా......లోపలికి రా" అని ఆహ్వానించాడు డాక్టరు.

డాక్టరు, లిప్టోవును ఇంతకు ముందెప్పుడూ ఇంత ఆప్యా యంగా ఆహ్వానించటం జరుగ లేదు. నిన్నటి విషయం డాక్ట రికి కూడా తెలిసి వుంటుందనుకొన్నాడు. అది అతనికి కోపం కల్గించింది. డ్రాయింగు రూములో కూర్చున్నాడు. ఆగది

అంతా దుమ్ముతో చాలా అసహ్యంగా వుంది. డాక్టరులాంటి వ్యక్తులు వుండవలసిందేగాని, అలాంటి గదిలో వుండటం ఇంకొకరికి చేతగానిపని. డాక్టరు, లిప్టోవుతో నైనను గురించి మాట్లాడాడు. యూలియ, నైనను చూడటానికనే వంకతో తనను ఇంటికి తీసుకొనివచ్చి తన మనస్సును మార్చుకొన్నానని చెప్పడానికి పన్నిన పన్నాగమని లిప్టోవు తలంచి, కోపంతో చాలా బాధపడ్డాడు. ఒక్క అనుమానం మరీ ఇప్పుడు అతనిని బాధిస్తూ వుంది. తండ్రీ, కూతురు రాత్రంతా కూర్చుని, నిన్నటి విషయం మంచీ చెడు ఆలోచించివుంటారని, చివరకు తనలాంటి భాగ్యవంతుడు వచ్చి అడిగినప్పుడు కాదని తృణీకరించటం తెలివి తక్కువ తనముగా తలంచి వుంటారని అతని అనుమానం. అలా అచ్చట కూర్చొని, రాత్రి, తండ్రీ కూతుళ్ళ మధ్య జరిగిన సంభాషణ వింటున్నట్లుగా తలంచాడు తల్లి తండ్రులు సహజంగా అనేమాటలు "నీవు అతని ప్రేమించనిమాట నిజమే; ఆలోచించు. నీ భవిష్యత్తును గూర్చి.....అతని ఆస్తిని గూర్చి......"

డాక్టరు రోగులను చూడడానికి బయలుదేరాడు. లిప్టోవు కూడా వెళ్ళబయలుదేరాడు. "వెళ్ళకండి, కొంచెంసేపు కూర్చొనండి" అని అడిగింది యూలియ, లిప్టోవ్‌ను.

ఆమె హృదయావేదన ఎక్కువవుతూ వుంది. బుద్ధిమంతుడు, దయాదాక్షిణ్యాలుగల గుణవంతుడు స్వయంగా వచ్చి, తనను వివాహమాడమని అడిగినప్పుడు, ఈ సంబంధానికి యిష్టపడటంవల్ల, నిరుత్సాహం, ఏమిటోగావున్న యీ రోజులు పోయి హాయిగా, ఆనందంగా గడిపే భవిష్యత్తు వుందని తెల్సి

నప్పుడు, తన వయస్సుకూడా మళ్ళిపోతూంది, భవిష్యత్తులో ఇంతకన్నా సదవకాశం వుండదనుకొన్నప్పుడు, అతనంటే ప్రేమలేదని, అతనిని ప్రేమించటము లేదని, పెళ్ళికి ఒప్పుకొనక పోవటము, ఈ పరిస్థితులలో మూర్ఖత్వముగాను, తెలివితక్కువ తనముగాను తలచి హృదయాన్ని దిట్టపర్చుకొన్నది. దేవుడు కూడా ఆమెను శిక్షింపవచ్చునని ఆమె భయపడిందికూడా.

డాక్టరు బయటకు వెళ్ళగానే, యూలియ లిప్టోవునైపుకు తిరిగి పాలిపోయిన ముఖంతో ధైర్యముగా "నిన్న మీరడిగిన విషయంగూర్చి ఇప్పటివరకు ఆలోచించుతూనేవున్నా, అలక్సీ ......నేను అంగీకరించుతున్నా" నన్నది.

అతను ముందుకు వంగి ఆమె చేతిని తీసుకొని ముద్దెట్టుకొన్నాడు. ఆమె అదోకరకంగా అతని తలనుముద్దిడుకొన్నది. ఆమె అంగీకారములో యిసుమంతకూడా ప్రేమ లేనట్లుగా, పరిస్థితులవత్తిడివల్ల ఆమె ఎంతగానో ప్రేమిస్తున్నట్లుగా నటించుతూందని భావించాడు లిప్టోవు. అప్పటినుండి వెంటనే బయలుదేరి ఎవ్వరికీ చెప్పకుండా, కన్పించకుండా, మాస్కో వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని ఆమె అతనికి ఎంతో దగ్గరలో హృదయానికి హృదయం ఆనించివుంది. కోరిక, ఆవేశం, సంతోషానందాలతో నింపివేశాయి. ఇప్పటికే అలాచేయటానికి ఆలస్యమైనట్లుగా తలంచి, ఆమెను మరీ దగ్గరకు తీసుకొని హృదయానికి హత్తుకున్నాడు. ప్రేమపలుకులు పలుకుతూ ఆమె మెడను, బుగ్గలను, తలను, ప్రేమోద్వేగంతో, తన్మయత్వంతో ముద్దెట్టుకొన్నాడు.

యూలియ కిటికీవద్దకు వెళ్ళిసిల్చొన్నది. ముద్దులవల్ల, కౌగిలింతలవల్ల, సిగ్గుపడటమేగాక, కలవరపడిందికూడా. ఇద్దరూ "ఇదంతా ఎందుకు జరిగిందిరా భగవంతుడా" అనుకుంటూ జరిగిన దానికి పశ్చాత్తాపపడుతున్నారు.

"నేను ఎంత నిస్సహాయురాలనో మీకు తెల్సివుంటే" అన్నది, చేతులు నలుపుకుంటూ నెమ్మదిగా.

"ఎందుకని ?" అంటూ యూలియ వద్దకు వెళ్ళి "ఏమిటి ? నాకు చెప్పవూ ? నిజం చెప్పు యూలియ; నిష్కల్మషంగా నిన్ను నేను నిజంచెప్పమని కోరుతున్నా యూలియ" అన్నాడు.

"ఏమీ లేదు. నేను మీకు అనుకూలవతియైన భార్యగా వుంటూ, మీ సేవచేస్తూవుంటాను. తప్పక మరల సాయంకాలం వస్తావుగదూ ?" అన్నది తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో.

తరువాత లిప్టోవు తన అక్కవద్ద కూర్చొని చరిత్రాత్మక నవల చదువుతూవుండగ, గతం.—అతను ఆవేశంతో చేసిన తెలివితక్కువపని, ఆమె అతనిని మనస్పూర్తిగా ప్రేమించ లేదు, కాని వివాహమాడ అంగీకరించింది. దానికికారణం తనడబ్బు కాని, తనుగాదు. ఆమె తనడబ్బుకు విలువకట్టిందిగాని, తన యోగ్యతలకుగాని, తెలివితేటలకుగాని గాదు. ఆమె నిజంగానే తనను ప్రేమించటంలేదు. చెప్పరాని, చెప్పలేని కారణాలనేకం వుండి వుండవచ్చు. కాని తనను వివాహమాడ నిశ్చయించుకొన్నది - మొదలగు విషయాలు గుర్తుకువచ్చాయి. మధ్యతరగతి బూటకాలకు ఆలవాలమైన డాక్టరుగారి ఇల్లు, అసహ్యంగా వుండే డాక్టరు, అంతె అతనికి తగని ఏవగింపుగావుంది. చివరకు యూలియ పేరుకూడ చాల అసహ్యంగా వుందతనికిప్పుడు.

వాళ్ళుయిద్దరూ, ప్రేమించుకొన్నా, ప్రేమించుకొనకపోయినా, వివాహసమయంలో అర్థంలేనిమాటలు నాల్గు ఉచ్చరించుతారు. ఎవరో మధ్యవర్తిమాట్లాడి పెండ్లిచేయించినట్లుగా జరిగిపోతుంది. అలా ఎంతోమంది పెండ్లిండ్లుచేసుకొని, తరువాత ఒకరినొకరు ప్రేమించుకొని, ఆనందంగా కాలంగడుపుతున్నారనే తలంపుతో అతని కెంతో ఓదార్పు కూడాకల్గింది.

"రోమియో జ్యూలియట్" అంటూ పుస్తకంమూస్తూ "నేను రోమియోను, నైనా నన్ను దీవించవూ? నేనూ, యూలియ, యీరోజే పెండ్లిచేసుకొన నిశ్చయించుకొన్నాము" అన్నాడు.

నైన మొదట నమ్మలేదు. తరువాత లిఫ్టోవు నమ్మకంగా చెప్పటం వల్ల నమ్మింది. కానామెకు చాల ఆశ్చర్యంకూడ కల్గింది.

"నేను తప్పకదీవిస్తాను అలెక్సీ! అనుకొనకుండా కల్సి వచ్చిందిగాదూ" అన్నది నైన.

"అకస్మాత్తుగా జరిగిందేమీగాదు. మార్చిలో మొదటిసారిగా యూలియాను నీ గదిలోనే చూస్తా."

"నేను నీవు మాస్కోలో మరొకరి నెవరినైనా చేసుకొంటావనుకొన్నా"నని కొంచెంసేపు ఆగి, మరల "మనకు తెల్సిన పిల్లఅయితే యింకా బాగుండేది. కాని, నాకు కావల్సినదల్లా నీ ఆనందం, సుఖం, అలెక్సీ. నా భర్త నన్నెప్పుడూ ప్రేమించలేదు. చూడు, మేము ఎలా బ్రతుకుతున్నామో! నీవు తెలివిగలవాడవు. మంచిచెడులు తెల్సిన దయాదాక్షిణ్యాలు కలవాడవు. ఏ స్త్రీఅయినా నిన్ను ప్రేమిస్తుంది; నీతో

సుఖపడుతుందికూడ; యూలియప్రౌఢ. మాస్కోలో చదువు కొన్నదికూడ. హాయిగా బ్రతకటానికి దయా, తెలివితేటలే సరిపోవు అలెక్సీ. యూలియ వయస్సులో వుంది. నీ వేమంత యువకుడవు, అందగాడివిగాదు అలెక్సీ!" అని, చివరి మాటలు అతనికి కష్టం కల్గించకుండా వుండాలని ఎంతో ప్రేమ, ఆప్యాయతలతో అతని గడ్డం పుణికింది.

"నీవు అందగాడివి కాకపోవచ్చు; కాని, చాల తెలివి గలవాడవు అలెక్సీ" అన్నది.

ఆవేశంతో ఆమె బుగ్గలు ఎఱ్ఱబడ్డాయి. అలెక్సీని దీవించటం ఆమె ధర్మమా? న్యాయమా? నైన అతనికి అక్క. తల్లితరువాత తల్లి అంతటిది. పెళ్ళి వాళ్ళ కుటుంబ హోదాకు తగినట్లుగా గొప్పగా, బ్రహ్మాండంగా, సరదాగా జరగాలంటూ విచారగ్రస్తుడై వున్న తమ్ముని సంతోషపెట్టటానికి ప్రయత్నించింది.

కాబోయే అల్లుడు డాక్టరుగారి యింటికి రోజుకు మూడు, నాల్గుసార్లు వెళ్లివస్తూవుండేవాడు. నైనవద్ద కూర్చొని చరిత్రాత్మక నవలలు చదువుతూ, సమాకు విశ్రాంతి యిచ్చే వారు యిప్పుడెవరూ లేరు. యూలియ, లిప్టోవును తనక్రింద వున్న రెండు గదులలోనికి ఆహ్వానించుతూ వుండేది. లిప్టోవుకు ఆ రెండుగదులు చాల అందంగా కన్పించేవి. యూలియ యింట్లో పిల్లిలా నడుస్తూవుండేది. స్వతహా ఆమె ఎప్పుడూ, ఎవరితోను అనవసరంగా మాట్లాడని వ్యక్తిఅని, అందువల్లనే ఆమె ఒంటరిగా కాలం గడుపుతూ వుంటుందని లిప్టోవు తలంచాడు. ఆ యింట్లో ఆమె చిన్న పిల్లగానే పరిగణింపబడుతూ

వుండేది. ఆమెవద్ద ఎక్కువ డబ్బుకూడ వుండేదిగాదు. ఆమెతం డ్రామెకు పుస్తకాలకని, బట్టలకని సంవత్సరానికి 100 రూబుళ్లు యిస్తూవుండేవాడు. ఏదో ప్రాక్టీసువున్నా అతని వద్ద డబ్బు అంతంతమాత్రంగానే వుండేది. ప్రతిరోజూ సాయం కాలం క్లబ్బులో పేకాడుతూండేవాడు. పాపం, ఒక్కసారి కూడ ఎక్కువగా గెల్చినపాపాన పోలేదు. తరచుగా పోగొట్టు కొంటూనే ఉండేవాడు. "మ్యూచివల్ క్రెడిట్ సొసయిటీ" ద్వారా యిళ్ళుకొని అద్దెకు యిస్తూవుండేవాడు. అద్దెకు ఉన్న వాళ్ళు సరిగా అద్దె యిచ్చేవారుగాదు. అతనుచేసి బేరాలన్నీ చాల లాభదాయకమని అతని నమ్మకం. ఇప్పుడు వాళ్ళు వుంటున్న యిల్లుకూడ తాకట్టుపెట్టి డబ్బుతెచ్చి చాల ఖాళీ స్థలం కొని, పెద్ద మేడ ఒకటి కట్టించ మొదలుపెట్టాడు. తరు వాత అవుసరంకొద్దీ యిదికూడ తాకట్టు పెట్టవచ్చునని అతని ఉద్దేశ్యం.

లిప్టోవు చాల గమ్మత్తుగా, రెండు రకాల మనిషిగా అతను కలలోకూడ అనుకొనని పనులు చేస్తున్నాడు. ఆయన కాబోయే మామగారితో క్లబ్బులో 'డిన్నర్ల'కు మూడుసార్లు వెళ్ళాడు. ఇళ్ళకు డబ్బుకూడ యిస్తానన్నాడు. చివరకు 'ఘనరోవ్' యింటికికూడ భోజనానికి ఘనరోవ్ ఆహ్వానంమీద వెళ్ళాడు. అచ్చటే పొడుగ్గా, సన్నగా, నల్లనికళ్ళు, వెంట్రు కలు కల్గివున్న 35 సంవత్సరాల స్త్రీని కల్సుకొన్నాడు. ఆమె ముఖం అంతా పౌడరుతో నిండివుంది. చాల గమ్మత్తుగా నవ్వుతూ ఉంటుంది. ఆమె తన కష్టాలను, విచారాన్ని కప్పి పుచ్చుకొనటానికి అలా నవ్వుతూ ఉంటుందని లిప్టోవు తలం

చాడు. సహాలా ఉన్న 5, 3 సంవత్సరాల వయస్సులో ఉన్న యిద్దరు చిన్న పిల్లలనుకూడ చూశాడు.

భోజనం చేస్తూవుండగా, అతనక్కడకు వెళ్ళటం తన తెలివితక్కువతనంగా తలంచాడు. యజమానురాలు భయ పడుతూ, కలవరపడుతూ ఉన్నట్లు ఎప్పుడూ పళ్ళికిలిస్తూ ఉంటుంది. ఫనర్వో ప్రేమ, దాని పుట్టుక మొదలగు విషయా లపై ఉపన్యాసం మొదలుపెట్టాడు.

ఆమెవంక తిరిగి ఫ్రెంచిలో మాట్లాడుతూ "అంలా సమస్యలో ఏముంది ? అది అంతా విద్యుశ్ఛక్తికి సంబం ధించిన విషయం. మన శరీరాలలో మనకు కనిపించని కొన్ని మాంస గ్రంథులున్నాయి. అవే మనలో విద్యుత్ ప్రసా రాన్ని కలుగచేస్తాయి. రెండుశరీరాలలోను ఒకేరకపు మాంసపు గ్రంథులుండి, విద్యుత్ చ్ఛక్తి గనుక సమాంతరముగా ప్రవ హించటం జరిగితే, దాని ఫలితంగాకల్గేదే ప్రేమ.

లిప్టోవు యింటికితిరిగి రాగానే, నైన అతనెక్కడికి వెళ్ళింది అడిగింది. లిప్టోవు సమాధానం చెప్పక పోవటమే గాక చాలసిగ్గు పడ్డాడుకూడ.

'యూలియ' తనను ప్రేమించటంలేదని ఎంతగానో బాధపడుతూ వుండేవాడు. 'యూలియ' అంటే అతనికిమట్టుకు రోజు, రోజుకు ప్రేమ ఎక్కువగుతూనే వుంది. కాని యూలియ మట్టుకు ప్రేమను తిరిగి యివ్వలేక పోయింది. ఆమె తనకు అన్యాయముచేస్తూ యున్నట్లుగా తలంచుతూ వుండేవాడు. చాల సార్లు నిస్పృహా, నిరుత్సాహంతో బాధపడుతూ పెళ్ళి మాను కోవాలనుకొంటూ వుండేవాడు. నిద్రపట్టేదిగాదు. మంచంపై

వెల్లకిలగా పడుకొని ఆలోచించుతుండేవాడు. మాస్కోలో వున్న "అమ్మాయిక్" వివాహం తరువాత మాస్కో వెళ్ళినప్పుడు ఏమిచెప్పాలి? నాన్న, అన్నయ్యా యూలియఃను గూర్చి పెండ్లిని గూర్చి ఏ విధంగా తీసుకుంటారో? వాళ్ళు అసలే ఒకరకంగా కయ్యాళిమనుష్యులు. మొట్టమొదటిగా తన తండ్రి యూలియను చూసినప్పుడు చాల అసహ్యంగా, కఠినంగా ప్రవర్తిస్తాడని భయపడ్డాడు. ఈ మధ్యవాళ్ళన్నయ్యాకూడా చాలా గమ్మత్తుగా ప్రవర్తిస్తున్నాడు. మాస్కోనుండి వాళ్ళన్నయ్య ఆరోగ్యమే మహాభాగ్యమంటూ ఆరోగ్యసూత్రాలనుగూర్చి, మానసిక వ్యాధినిగూర్చి, మతంను గూర్చి, పెద్దపెద్ద ఉత్తరాలు వ్రాస్తూండేవాడు. కాని వ్యాపారాన్నిగూర్చిగాని, ఇతర మాస్కో విషయాలనుగూర్చిగాని ఒకముక్కకూడా వ్రాసేవాడుగాదు. ఆ ఉత్తరాలు లిప్టోవుకు చాలాబాధను కల్గించేవి. తన అన్నలో చాలా మార్పువచ్చి నట్లుగా తలంచాడు.

సెప్టెంబరులో యూలియ, లిప్టోవులకు వివాహం జరిగింది. ఆ రోజుననే వాళ్ళు మాస్కోకు ప్రయాణం అయ్యారు. లిప్టోవు, యూలియ, నైసవద్దకు చెప్పివచ్చుటకు వెళ్ళినప్పుడు నైస, ముఖంలో చాలమార్పు కనిపించింది. కాని కన్నీళ్ళు మటుకు పెట్టలేదు.

"నేనుచనిపోతే నాపిల్లలను నీవుపెంచాలి యూలియ"

"తప్పకుండా" అని మాటయిచ్చింది యూలియ వణకుతున్న పెదాలతో, కళ్ళనీళ్ళ పర్యంతమై.

"నిన్ను చూడటానికి మరలొకసారి అక్టోబరులో వస్తాను. ఆరోగ్యం గూర్చి జాగ్రత్త తీసుకో" అన్నాడు లిప్టోవు కన్నీళ్ళతో.

వాళ్లు యిద్దరూ చెరొకమూల కూర్చొని ప్రత్యేక రైలుపెట్టెలో ప్రయాణం చేస్తున్నారు. యూలియ ఒక మూల బయటకు చూస్తునట్లు, కూనిపాట్లుపడుతూవున్నట్లు కూర్చొని వుంది. లిప్టోవు ఆమెకెదురుగా బల్లమీద, తండ్రిని గూర్చి మాస్కోలోని "అమ్మాయి"ని గూర్చి, యూలియకు తన యిల్లు నచ్చుతుందో, నచ్చదోనని, మొదలగు విషయాలను గూర్చి మదనపడుతూ, ఆలోచిస్తూ కూర్చొన్నాడు. ఎదురుగా తనను ప్రేమించని తన భార్యవంక చూసి, బాధగా, వ్యథగా "ఇది అంతా ఎందుకు జరిగిందిరా" అని అనుకొన్నాడు తనలోతాను.

# 5

మాస్కోలో లిప్టోవు వాళ్ళది, జవాళీలు మొదలగు నేతసరుకుల హోల్ సేల్ వ్యాపారం. దాదాపు సంవత్సరానికి 20,00,000 రూబుల్ల వ్యాపారం చేస్తూవుంటారు. లాభ నష్టాలవిషయం, ముసలి తండ్రికితప్ప ఎవరికీ తెలియదు. లాభం దాదాపు సంవత్సరానికి 3,00,000, వరకు వుండవచ్చునని, ముసలాయిన కొద్దిగా జాగ్రత్తగా వుంటే, 4,00,000 రావచ్చునని, కొడుకులఅంచనా. రావల్సిన బాకీలుకూడ పెరిగిపోయినాయి. అంతాచూసీ, చూడనట్లుగానే పోతున్నారు.

వాళ్ళ షాపుకూడ చాల అసహ్యంగా, ఒక జైలులా వుంటుంది. క్రింద రెండుగదులున్నాయి. పైభాగం కొంతవరకు విశాలంగా వున్నట్లుగానే వుంటుంది. కాని అదికూడ క్రింది

భాగంలా అసహ్యంగానే వుంటుంది. బట్టలమూటలు జవాళీల కట్టలు, గదినిండా చిందరవందరగా అంతా వుంటాయి. ఆ కట్టలనుండే వేలకు, వేలుసంపాదించుతున్నారనిగాని, ఆచీకటి యిరుకు కొట్టులో, వచ్చిపోయే వ్యాపారస్తులుగాక, దాదాపు ప్రతిరోజు 50 మందిపనిచేస్తూ వుంటారనిగాని నమ్మటంచాలా కష్టం.

లిప్టోవు వచ్చిన మరునాడు మధ్యాహ్నం షాపుకు వెళ్ళాడు. అచ్చట పనులవల్లఅంతా గల్లంతుగాను, ఆ కట్టలు, బట్టలమూటలవల్ల ఆ ప్రదేశమంతా చిందర, వందరగాను వున్నది. మెట్లుఎక్కుతూవుండగ అతను కల్సుకొన్న మొదటి వ్యక్తి, అతని అన్న ఫాయిడరు. ఎరిగివున్నవాళ్ళంతా ఫాయిడరు, లిప్టోవు, ఒకటిగానే వుంటారనుకొంటారు. అన్నను చూసి నప్పుడల్లా, లిప్టోవుకు, తనుకూడ, అలాగే, పొట్టిగా, ఎర్రని బుగ్గంతో, పలుచని వెంట్రుకలతో "నేనుకూడ అంత అసహ్యంగా, వికృతంగావుంటానా" అని తనను తాను గుర్తు తెచ్చుకుంటూ అనుకొంటూ వుంటాడు.

"చాలసంతోషం. చాలసంతోషం. ప్రతిరోజూ నీ రాక కొరకు ఎదురు చూస్తూవున్నాము తమ్ముడూ. నీ వివాహం సంగతి విన్నప్పటినుండి ఎంతో సంతోషంగావుంది. నిన్ను చూడాలనే కోరికకూడ ఎక్కువగుతూనే వచ్చింది. ఆరు నెలలయినది నీవు వెళ్ళి. కబుర్లేమిటి ? నైనా ఎలావుంది ? ఆమె ఆరోగ్యం బాగాచెడిపోయిందా?" అని అడిగాడు ఫాయిడరు, లిప్టోవు చేతులు ఎంతోఆప్యాయంగా నొక్కుతూ.

"ఆ. నైన ఆరోగ్యం ఏమీ బాగా లేదు. బాగా క్షీణించి పోయిందికూడ."

"అంతా దేవునిదయ" అంటూ ఫాయిడరు నిట్టూర్చి "యిక చెప్పు యిప్పుడు నీ భార్యనుగూర్చి. చాలఅందంగా వుండివుంటుందిగదూ. నేనామెను చూడాలి. ఆమె నా చిన్న చెల్లెలు" అన్నాడు.

కూర్చీలో కూర్చొని బేరానికివచ్చిన ఎవరితోనో మాట్లాడుతూవున్న తండ్రిని లిప్టోవు వెనుకనుండి చూశాడు.

"నాన్నా చూడు. దేవుడు మనకెవరిని పంపాడో! అలెక్సీ యిడుగో" అంటూ అరిచాడు ఫాయిడరు.

లిప్టోవు తండ్రి 80 సంవత్సరాల వయస్సులో వున్నా, దృఢంగా, ఆరోగ్యంగా, పొడుగుగా వుంటాడు. చాలబిగ్గరగా, ధైర్యంగా మాట్లాడుతూ వుంటాడు. గడ్డం నున్నగా వుంటుంది. చుట్టలు కాలుస్తాడు. సంవత్సరం పొడుగునా, సన్నని, వదులు చొక్కాలే తొడుగుతూ వుంటాడు. ఈ నడుమ కొంచం చూపు తగ్గటంవల్ల వ్యాపారం జోలికి పోవటం తగ్గించాడు. కాని ప్రతిరోజూవచ్చి కూర్చొని, వచ్చే పోయే బేరగాళ్ళతో, టీ త్రాగుతూ, కబుర్లు చెబుతూ వుంటాడు.

లిప్టోవు ముందుకువంగి తండ్రిచేతిని ముద్దెట్టుకొన్నాడు.

"చాలకాల మయ్యింది నీవు మమ్ములను వదలివెళ్ళి, నేను, నిన్ను, దీవించాలని నీకున్నదిగదూ? నీ వివాహ సందర్భంగా తప్పక దీవిస్తా. అభినందిస్తున్నాకూడ" అన్నాడు ముసలాయన ఎంతో ప్రేమతో.

మరల లిప్టోవు తండ్రిని ముద్దెట్టుకున్నాడు.

"నీ భార్యను దీసుకొనివచ్చావా ?" అని అడిగి ముస లాయన సమాధానికి ఎదురు చూడకుండగనే బేరానికివచ్చిన వానితో "ఏమిటో. నాన్న నేను ఫలానపిల్లను పెళ్ళిచేసు కొనాలనుకొంటున్నా, నీ ఆజ్ఞా, దీవెనలు యివ్వు నాన్నా "అని అడగటం, మంచీ, మర్యాద, గౌరవం ఏమీ లేవు యీ కాలపు పిల్లలకు. ఇప్పటివాళ్ళకు మనం చెప్పగలమా ? నాకు నల్భై సంవత్సరాలకుపైన వచ్చిన తరువాత నేను పెళ్ళి చేసుకొన్నాను. అప్పుడుకూడ మా తండ్రిగారివద్దకు వెళ్ళి, ఆయన యిష్టం కొరకు, దీవెనలకొరకు ప్రాధేయపూర్వకంగా ప్రార్థించాను. అలాంటివాళ్లు యిప్పు డెవరున్నారు ? ఆ కాలమే వేరు. కాలం మారిపోయింది" అన్నాడు.

ముసలాయనకు లిస్టోవును చూడటం చాల సంతోషం గానే వుంది. కాని అది పైకి కనబడనివ్వటం అతనికి యిష్టం లేదు. ముసలాయన మాట్లాడే విధం, అడిగే ప్రశ్నలు పూర్వంలాగనే అతనికి విసుగును కల్గిస్తున్నాయి. అతనికి వెనుకటి విషయాలు - ఎలా వాళ్ళకు తండ్రి, రొట్టె, మంచి నీళ్లూ తప్ప ఏమీ యిచ్చేవాడు కాదో, ఎలా వాళ్ళను తిడుతూ, కొడుతూ వుండేవాడో మొదలగు విషయాలు గుర్తుకు రాసాగాయి. అయిదునిముషాలు అతను అచ్చట వుంటే చాలు, ఎవరొకరువచ్చి తనను తిట్టి, కొడతారని, చెవులు మెలివేస్తారని అతను అనుకొనటానికి.

"అలెక్సీ! యితను టామ్‌బో. మనబేరగాడు. 50 సంవత్స రాలవయస్సువచ్చినా యింకా పిల్లలనుకంటూనే వున్నాడు.

నవయువక చిహ్నం కదూ" అంటూ పరిచయం చేశాడు ఫాయిడర్.

అందరూ నవ్వారు.

"సృష్టిమహత్యం. లోపలకు పంపినది ప్రతిదీబయటకు వస్తుంది" అన్నాడు సీనియరుక్లర్కు.

ఆ సీనియరుక్లర్కు ప్రతివిషయం తనకెంతో తెల్సినట్లుగా, తనే ఎంతో తెలివిగలవాడుగా, అదొకరకంగా, డొంకతిరుగుడుగా చెబుతూవుంటాడు, చేతులుత్రిప్పుతూ.

అతనలా చెప్పినప్పటికి తక్కిన గుమస్తాలకు చాల తేలికగా అర్థంఅవుతుంది. అతనిపేరు పోచాట్కిన్.

ఆఫీసులో, గుర్తుంచుకోనవల్సిన ప్రముఖవ్యక్తులలో, లావు ముసలి మకీషు ఒకడు. అతనుకూడ లిఫ్టోవు వద్దకువచ్చి అభినందించాడు.

తరువాత ఒక్కొక్కరే గుమస్తాలంతావచ్చి లిఫ్టోవును అభినందించారు.

లిఫ్టోవుకు అచ్చటవుండాలని లేదు. కనీసం రెండుగంటలయినా వుండటంమంచిది. అందువల్లనే యిష్టంవున్నా లేకపోయినా, అందరితో మాట్లాడుతూ కూర్చున్నాడు. మకీషు వద్దకు వెళ్ళి వేసవిఎలావుందని అడిగాడు. మకీషుకూడ చాల గౌరవంగానే సమాధానాలుయిచ్చాడు. ఇంతలో ఒక కుఱ్ఱవాడు సాసరులేకుండా, గ్లాసుతో 'టీ' తెచ్చి లిఫ్టోవుకు యిచ్చాడు. ఇంకొక కుఱ్ఱవాడు అటువెళ్ళుతూ, అచ్చటున్న సామానుకు కొట్టుకొని పడేవాడయ్యాడు. ఇంతలో మకీషు కళ్ళురిమి "నీవెళ్ళేది ఎక్కడికని" ఆ కుఱ్ఱవాడిని గదమా

యించాడు. గుమస్తాలందరకు చిన్న యజమాని పెండ్లి చేసుకొని రావటం చాలసరదాగానేవుంది. ప్రతిఒక్కరూ,ఏదో ప్రేమ పూర్వంగా, గౌరవంగా, చెప్పాలన్నట్లు అతనివంక చూస్తున్నారు. కాని వాళ్ళ ప్రేమంతానాటకమని, అతనంటే భయంవల్లనే వాళ్ళు అలానమ్రతగా వుంటున్నారని లిస్ట్రోవు ఉద్దేశ్యం. 15 సంవత్సరాలకు పూర్వం, ఒక గుమస్తాకుమతి చెడి, అతను ఎలా అరుస్తూరోడ్డు వెంట పరుగెత్తాడో, అతను బాగుపడ్డతరువాత కూడ ప్రతిగుమస్తా ప్రత్యేకంగా పనిగట్టుకొని వెళ్ళి, ఎలా అతను అరచింది, ఏమేమి చేసినది మొదలగువిషయాలు గుర్తుకు తెచ్చి ఎలాఅతనిని బాధపెడుతూవుండేవారో యింకను లిస్ట్రోవు మర్చిపోలేదు. లిస్ట్రోవుతండ్రి గుమస్తాలను చూసేవిధం గూర్చి చుట్టుప్రక్కల చర్చలు జరుగుతూనేవుండేది. ముసలాయన అభిమానులు పోచాట్కిన్, మకీషుకు అసలు జీతం సంవత్సరానికి 3000 రూబుళ్లు మాత్రమే. కాని దాదాపు 7000 వరకు ముట్టుతున్నట్లుగా, అందరూ అనుకొంటూ వుండేటట్లు చేసేవాడు. ఇతరుల విషయంలోకూడా అంతే. ప్రతివారూ తమకు ఎక్కువే వస్తుందని తలంచుతుండేవారు. క్రొత్తగా చేరినవారికి ఎప్పుడు ప్రమోషను వస్తుందో, లేదోకూడ ఎప్పుడూ తెలియదు. వాళ్ళు పెండ్లిండ్లు చేసుకోరాదని ఎచ్చటా శాసనంలేదు కాని యజమానికికోపంవచ్చి, ఉద్యోగం ఊడుతుందేమోననే భయంతో, బ్రహ్మచారులుగానే వుండి పోతారు. వాళ్ళు ఎచ్చటికైనా వెళ్ళవచ్చు. ఇష్టంవచ్చినట్లు తిరగవచ్చు కాని 9 గంటలల్లా ఆఫీసులో వుండాలి. ఒక్క నిమిషం తర్వాత వచ్చినా గేట్లువేసివుంటాయి. ప్రతి ఉదయం

గుమస్తాలు త్రాగిందిలేనిది తెల్సుకోడానికి ముసలాయన వాళ్ళను దగ్గరకు పిల్చి నోటితో గాలినిపీల్చి తన ముక్కు-వద్ద వదలమంటూండేవాడు.

చర్చిలో ఏది జరిగినా అచ్చటవాళ్ళంతా తప్పక హాజరవ్వాలి. యజమానికి కన్పించాలి. యజమాని కుటుంబంలో ఎవరుపుట్టినరోజు పండుగజరుపుకొంటున్నారు అందరిగుమాస్తాలు కలిసి ఏదోక బహుమతి యిచ్చివెళ్ళాలి. వాళ్ళంతా "పయాట్నిటస్కాయ" బజారులోవున్న యింట్లో క్రిందిభాగంలో గదికి ముగ్గురు, నల్గురు చొప్పునవుండి, కల్సివండుకొని తింటూ వుంటారు. వాళ్ళు భోజనం చేస్తూండగా ఏ యజమాని వచ్చినా లేవవల్సినదే.

ముసలాయన తత్వం నచ్చినవాళ్ళకుమట్టుకే ఆయన మంచివాడని ఆయనవద్దనే వుండటం లాభదాయికమని అన్పించుతుంది. తక్కినవాళ్ళంతా లిప్టోవును ఒక ద్రోహిగా చూస్తూ వుంటారని లిప్టోవుకు తెల్సు. ఈ ఆరు నెలలలో యేమార్పూ జరుగలేదు. ఒకప్పుడు నిశ్శబ్దంగా, తెలివిగలవాడుగా, యుక్తిగా వుండే అన్న యిప్పుడు పెన్సిలొకటి చెవులో పెట్టుకొని అటూ ఇటూ ఎంతో పనిచేస్తున్నట్లు బేరగాళ్ళ భుజాలుపట్టుతూ, గుమస్తాలను "స్నేహితులారా" అని పిలుస్తూ, తిరుగుతున్నాడు. అతనునిజంగానే పెద్దనాటకం ఆడుతున్నాడు. లిప్టోవు తన అన్న అలా తయారవుతాడని ఎన్నడూ తలంచలేదు.

ఇంకా ముసలాయన అరుస్తూనేవున్నాడు. వచ్చిన వ్యాపారస్తులకందరకు బ్రతికే విధానంగూర్చి వ్యాపారం నడుపుకొనవచ్చిన మార్గాలనుగూర్చి ఉపన్యాసంయిస్తుంటాడు. తనను

ఉదాహరణగా తీసుకోనమని సలహాలిస్తూంటాడు. ఆయనకు అంతకన్నా మరేమీపనికూడా లేదు. లిప్టోవు అదేగొంతుకను 10 సంవత్సరాలనుండి, గాదు, 20 సంవత్సరాలనుండి వింటున్నాడు. ముసలాయన ఎల్లప్పుడూ తననుతానే పొగుడుకుంటూ వుంటాడు. అతని ఉపన్యాసం వింటూ వుంటే, భార్యా పిల్లలను ఎంతో సుఖపెట్టివుంటాడని, పిల్లలకోరకు అంత ముసలితనంలో గూడ కష్టపడి డబ్బు సంపాదిస్తున్నాడని తన క్రింద పనిచేసేవారంటే, ఎంతో దయా దాక్షిణ్యాలు చూపిస్తూ వుంటాడని, యిరుగు పొరుగువారితో కల్సిమెల్సి సహాయ సానుభూతులతో మెలగుతూవున్నట్లు గాను, అతనెల్లప్పుడు మంచే చేసేవాడుగాను, యితరులకు వ్యాపారంలో నష్టంజరిగితే అతని సలహాలు పాటించకపోవటం వల్లనేనని, అతని సలహా లేకపోతే ఏపని సవ్యంగా కానట్లు గాను వినేవాళ్ళందరకూ అనిపించుతూ వుంటుంది. చర్చిలో కూడ మాంయుసిల్పోని కర్మకాండ సరిగా జరపటంలేదని మతాధికారులను మందలిస్తూ వుంటాడు. అతను దేవునికి ఏ మాత్రం అపకారం, అన్యాయం జరుగకుండా చూస్తూ వుండటంవల్లనే దేవునికి కరుణాకటాక్షాలకు పాత్రుడైనట్లు గాను భావించుతూ వుంటాడు.

ముసలాయన తప్ప, అంతా పనివత్తిడిలో వున్నారు. లిప్టోవు వెళ్లివస్తానని చెప్పి రావటానికి అన్నగారివద్దకు వెళ్ళాడు.

"రేపు నా భార్యను పయాట్నటస్కాయకు తీసుకొని వస్తాను. కాని నాన్నగనుక కోపంవచ్చేటట్లు ఏమయినా

మాట్లాడటం జరిగితే ఆయనకు, నాకు రాంరాం. నేను వెంటనే యిల్లువదలి వెళ్లుతా తెల్సిందా" అన్నాడు.

"పెళ్లయినా నీవుమట్టుకు ఏమీ మారలేదు తమ్ముడూ. కాస్త ముసలాయనకు మంచిమాటలు చెప్పి కుషామత్ చేస్తూ వుండాలి "అలెక్సీ". సరే రేపుతప్పక, 11 గంటలకు చర్చి నుండి తిన్నగా అక్కడికేరా".

"నేను చర్చికి వెళ్లను."

"ఎలాగయినాసరే, తప్పక రేపు 11 గంటల లోపునే నీవక్కటకురావాలి. అంతాకల్సి పూజచేసి భోజనం చేద్దాము. నా చిన్న చెల్లెల్ని అడిగానని చెప్పు" అన్నాడు ఫాయిడరు, అలెక్సీ మెట్లు దిగుతూవుండగా.

"ఎందుకలా గమ్మత్తుగా వికతుడైనట్లుగా వుంటాడు" అని తన అన్నలో వచ్చిన మార్పుకు తనలో తాననుకొన్నాడు లిప్టోవు. "చాలా విచిత్రంగా మాట్లాడుతున్నాడు. తమ్ముడూ నా ప్రియమైన తమ్ముడూ—దేవుడు చాల దయ గలవాడు—దేవుని ప్రార్థించు" మొదలగు అన్నమాటలు గుర్తుకు తెచ్చుకొని, అన్నలోవచ్చిన మార్పుకు లిప్టోవు చాల విచారపడ్డాడు.

# 6

మరునాడు ఆదివారం ఉదయం 10 గంటలకు "పయా త్నిటస్కాయ" కు లిస్టోవు, యూలియ బయలుదేరారు. త్రోవలో లిస్టోవ్, ముసలాయన ఏమి అనబోతాడో అనే భయంతో బాధపడుతున్నాడు. యూలియ, భర్త యింటిలో గడిపింది రెండురాత్రులు. అప్పటికీ తాను చాలా తప్పుచేసి నట్లుగాను, తన జీవితం నిస్సారం, నిష్ప్రయోజనమైనట్లుగా తలంచింది. మాస్కోలో కానట్లయితే అంతకాలంకూడా అన్ని సహించి అంతంతమాత్రముగానైన యుండగలిగేదిగాదు. మాస్కో ఆమెలో నూతోత్సాహం కల్గించింది. మాస్కో బజార్లు, యిల్లు, చర్చిలు, వసంతకాలం అంటే ఆమెకు మహా యిష్టం.

బండి క్రొత్తగా సున్నంకొట్టిన రెండు అంతస్థుల ఆవరణలో ఆగింది. అచ్చటంతా ఈ దంపతుల కొఱకు ఎదురు చూస్తున్నారు. ద్వారపాలకుడు టోపీతీసి నమస్కారంచేశాడు. పోలీసు సాల్యూట్ చేశాడు. తలుపువద్దకు ఫాయిడరు ఎదురుగా వచ్చి యూలియ చేతిని ముద్దెట్టుకొని "నిన్ను చూడటం నాకెంతో సంతోషంగావుందమ్మా, నీ కిదే మా సుస్వాగతం" అంటూ ఆమెను లోపలకు తీసుకొని వెళ్ళాడు. లోపల జనంతో హాలు క్రిక్కిరిసివుంది. ఆ ప్రదేశం అంతా ధూపం వాసనతో నిండివుంది.

"నేను నీకు మా తండ్రిగారిని పరిచయం చేయాలి", అంటూ ఫాయిడరు "ఈయనే మా తండ్రిగారు" అంటూ ముసలాయనను యూలియకు పరిచయం చేశాడు.

ముసలాయన మాట్లాడకుండగనే తన చేతిని యూలియ చేతికి అందించాడు. ప్రతిఒక్కరూ నిశబ్దంగా యున్నారు. యూలియ కొద్దిగా ఖంగారుపడింది.

పూజలు మొదలుపెట్టారు. బంట్రోతులు పిల్లి అడుగులు వేసుకుంటూవచ్చి బాకులుతీర్చి వరుసగా నిలబడ్డారు.

పూజ జరుగుచున్నంతసేపు ముసలాయన "అలా చేయాలి; ఇలా చేయాలి; ఆమాత్రం తెలియదా" అని ఎప్పుడు అంటాడోనని అందరూ ఖంగారుగానే వున్నారు.

క్రాసును ముద్దెట్టుకొనటానికి అలెక్సీకి, ముసలాయనకు మతాధికారి యిచ్చాడు. యూలియవద్దకు వచ్చేటప్పటికి మతాధికారి చేతితో దానిని కప్పి, తనముందు మాట్లాడ దల్చుకొన్నట్లు సౌంజ్ఞ చేశాడు. అంతా నిశబ్దంగావున్నారు.

"దేవుడు సాక్ష్యాలు, బెతెల్ హేమ్ దేవుని ఆజ్ఞపై వచ్చాడు. ఆ ప్రాంతములోని పెద్దలు భయంతో వణికిపోతూ అతని ఆహ్వానించి, శాంతియుతునిగా రమ్మని కోరారు. అప్పు డతను - నేను దేవునికి బలి అవటానికి వచ్చాను. మీరు కూడా రండి, బలి అవండి, పునీతులు కండి అని సమాధానం యిచ్చాడు. దేవుని బిడ్డా, యూలియ ప్రశాంతముగా మా యింటికి దయచేయండి" అని మతాధికారి అన్నాడు.

యూలియ ముఖం ఆవేశంతో ఎర్రబడింది. తర్వాత యూలియకు ముద్దెట్టుకొనటానికి క్రాసును యిచ్చాడు.

"ఇప్పుడే వారు వివాహితులైనట్లు."

మరల ప్రార్థనలు సాగించారు. గది అంతా నిశ్శబ్దంగా వుంది. ముసలాయన ఆవేశంతో, కన్నీళ్ళతో యూలియను

మూతుసాస్లు ముద్దెట్టుకొని "ఇది నీ యిల్లమ్మా. నేను ముసలి వాడిని; నాకేమీా అక్కర్లేదు" అన్నాడు.

గుమస్తాలు తా ఒక్కొక్కరే వచ్చి అభినందించారు. భోజనాలు వడ్డించారు. యూలియ మామగారి ప్రక్కన కూర్చొన్నది. అప్పుడు మరల ముసలాయన, యూలియ వాళ్లు వేరుగా యింకొకచోట వుండటం మంచిదిగాదని, అందరూ కలిసి ఒక్కచోటే వుండటం మంచిదని చెప్పాడు.

"నేను డబ్బు సంపాదించాను. నా పిల్లలు ఖర్చు పెడ తారు. మీారుకూడా వచ్చి యీా యింట్లోనే వుండి మాకు సహాయం చేయాలి. నేను ముసలివాడినైపోయాను. విశ్రాంతి తీసుకోవదల్చుకొన్నా" అన్నాడు.

ఫాయిడరు దాదాపు లిప్టోవులాగానే ఉంటాడు. లిప్టోవు కన్నా కంగారుపడుతూ, ఎక్కువ సిగ్గుపడుతూ ఉంటాడు. యూలియ నంటిపెట్టుకునే ఉన్నాడు, అక్కడున్నంతసేపు ఆమె చేతిని తరచుగా ముద్దెట్టుకుంటూ.

"మేము అతిసామాన్య వ్యక్తులము చెల్లీ! మేము సాధారణ రష్యను మనుష్యులం, క్రిష్టియనులము" అని అన్నాడు ఫాయిడరు.

వస్తూవుండగా, లిప్టోవు హృదయం ఎంతో తేలికపడి నట్లుగా తలంచాడు. భయపడినట్లుగా ఏమీా జరుగలేదు. అతను భార్యతో "అంత పుష్టి, దృఢకాయుడు, ఆరోగ్యవంతు డైన తండ్రికి మాలాంటి పిల్లలు ఎలా పుట్టారా అని నీవు ఆశ్చర్యపోతూ ఉండవచ్చు. కాని, దానిలో ఆశ్చర్యపడవల సిందేమీా లేదు. మా నాన్న పెండ్లి చేసుకొన్నప్పుడు ఆయన

గారి వయస్సు 45 సంవత్సరాలు; మా అమ్మ వయస్సు 17 సంవత్సరాలు. ఆయనంటే, మా అమ్మ గడగడా వణికి పోతూవుండేది. మా అమ్మ చాలా ఆరోగ్యంగావున్న రోజులలో నైన పుట్టింది. అందువల్లనే నైన మా కంటే ఆరోగ్యంగా, దృఢంగా వున్నట్లుగా వుంటుంది. మా అన్నయ్య గర్భంలో యుండగా మా నాన్న అంటె భయంతో, చిక్కి శల్యమై అనారోగ్యురాలైంది. నాకు యిప్పటికీ బాగా గుర్తుంది. నాకు అయిదు సంవత్స రాలు రాకపూర్వంనుండి, మానాన్న మమ్మలను ఎలా చావబాదుతూ వుండేవాడో, చెవులు మెలిపెట్టి యీడుస్తూ వుండేవాడో - యిప్పటికీ మరువలేకుండా వున్నాను. ప్రతి ఉదయం ప్రక్కమీదనుండి లేవగనే "మా నాన్న యీ రోజు కొడతాడా, లేదా? కొడితే ఎన్నిసార్లు కొడతాడు?" అనేవే మొదటి ప్రశ్నలు. మమ్మలను యితరపిల్లలతో ఆడు కోటానికి బయటకు వెళ్ళనిచ్చేవాడుకాదు. ప్రతిరోజూ ఉదయం చర్చికివెళ్ళి పూజచేస్తూ వుండేవాళ్ళం. నీకు మతం అన్నా, చర్చికి వెళ్ళటం అన్నా మహాయిష్టం. కాని నాకు చర్చిని చూడగనే నా చిన్ననాటి విషయాలు గుర్తుకు రావటం, భయంతో, ద్వేషంతో కపించిపోవటం జరుగుతుంది. నేను ఎనిమిది సంవత్సరాల వయస్సులో వున్నప్పటినుండి షాపుకు పని చేయటానికి వెళ్ళుతూ వుండేవాడిని. ప్రతిరోజూ దెబ్బలు తింటూండేవాడిని. తరువాత బడికి వెళ్ళటం మొదలుపెట్టాను. మధ్యాహ్నంవరకు బడిలో చదువు, తరువాత మరల షాపులో పని అలా నాకు 22 సంవత్సరాలు వచ్చేవరకు కాలం

గడిచింది. తరువాత యూనివర్సిటీలో చేరటం, 'యార్టిస్వి'ని కల్సుకోనటం జరిగింది. అతను నాకు చాలా సహాయం చేశాడు. ఇల్లు వదలి బ్రతకకలిగేటట్టు చేశాడు. ఇప్పుడతని యింటికి వెళ్లి అతనిని చూసివద్దామా? నాకు తెల్సిన వాళ్ళందరిలోకి అతను చాలా మంచివాడు. మనం వెళ్లితే చాల సంతోషిస్తాడు కూడాను" అన్నాడు.

# 7

నవంబరు మాసంలో, ఒక శనివారంనాటి సాయం కాలం, లిప్టోవు, యూలియ కలిసి ఒక గానసభకు వెళ్ళారు. హాలంతా జనంతో ఖాళీలేకుండా నిండిపోయింది. ఉక్కతో జనం చచ్చిపోతున్నారు. లిప్టోవు వెనుకకువచ్చి నిలబడ్డాడు. 'యూలియ' 'కోష్టియ' మూడవ వరుస కుర్చీలలో కూర్చొని యున్నారు. ఇంటర్వెల్ సమయం. లిప్టోవు ఆ అమ్మాయి పోలీనను చూశాడు. పెండ్లయినప్పటినుండి అతనికి ఆమెను చూడడమంటే చాలభయంగా వుంది. ఎప్పుడు కన్పించు తుందోనని తప్పుకొని తిరుగుతూనే వున్నాడు. ఇప్పుడామె ఎదుట కన్పించినప్పుడు, చివరకు, కనీసం, తన పెండ్లినిగూర్చి స్నేహపూర్వకంగానయినా వ్రాయనందుకు చాల కించ పడ్డాడు. సిగ్గుతో అతని ముఖం ఎఱ్ఱబడింది. గట్టిగా పోలీన అతనితో కరచాలనం చేస్తూ, యార్టిస్విని చూశావా అని అడి గింది.

అతను జవాబు యివ్వకముందే చాల విసుగుగా, తొందర తొందరగా ఎవరో వెనుకనుండి తరుముకొస్తున్నట్లుగా వెళ్ళిపోయింది.

ఆమె చాల సన్నబడిపోయింది. పెద్ద ముక్కు, చాల అలసట చెందిన ముఖం, అలసటవల్ల కళ్ళుగూడ తెరువలేకుండా వుంది. సరిగా కాళ్ళమీద నిలబడలేకుండాకూడ వుంది. ఆమె నల్లనికళ్ళు చాలఅందంగా వుంటాయి. ఆమె చూపుల్లో జాలి, కరుణ, తెలివితేటలు కన్పించుతూవుంటాయి. కాని నడవటం మట్టుకు తిన్నగానడక, అటూ యిటూ అంగలు పంగలు వేసుకొంటూ నడుస్తూవుంటుంది. ఆమెతో మాట్లాడటం చాల కష్టం. ఎందుకంటె ఆమె ఎవరిమాటైనా కనీసం వినటంగాని, ఎవరితోనైనా నెమ్మదిగా, ప్రశాంతంగా మాట్లాడటంగాని జరుగదు. ఆమెను ప్రేమించటం చాల కష్టం. ప్రేమనుగూర్చి ఆమె అభిప్రాయాలుకూడా వేరుగానే వుంటాయి. ప్రేమే జీవితంలో అత్యవసరమైనదిగాని, గొప్పదిగాని కాదంటూ, ప్రేమ సంభాషణ వచ్చినప్పుడల్లా ముఖానికి చేతులు అడ్డుపెట్టుకొని అదేపనిగా బిగ్గరగా నవ్వుతూవుంటుంది. ఆమె వయస్సు 30 సంవత్సరాలు. అయినప్పటికి 17 సంవత్సరాలకన్యలా, సిగ్గు పడుతూ, చీకటిలో తప్ప, వెలుతురులో ముద్దెట్టుకొననివ్వదు. ఒక బడిపంతులును వివాహమాడి అతనికి విడాకులిచ్చింది. ప్రస్తుతం, సంగీతం నేర్పి, సంగీతకచేరీలలో పాల్గొని కాలం గడుపుతూవుంది.

ఆమె అచ్చటనుండి ఎంతో తొందరగా వెళ్ళిపోవాలనుకొన్నది. కాని జనసమర్దంవల్ల వెళ్ళలేకపోయింది. రెండు

సంవత్సరాలనాడు, యిలాంటి గానసభలలో పాల్గొన్నప్పుడు తొడుక్కొనటానికి కుట్టించిన నల్లజాకెట్టును లిస్టోవు గుర్తించాడు. ఆమెకు పాపం, చక్కని దుస్తులు వేసుకొని నీటుగా వుండాలని వుంటుంది. కాని తనకు ఎలాంటివి బాగుంటవో తెలియదు. బట్టలకు డబ్బులు విసిరిపుచ్చుకొని పారవేస్తుంది. చివరకు ఏమిటోగా, దుస్తులంటే ఏమాత్రం యిష్టం లేనట్లుగా, దుస్తు లేసుకొంటుంది. ఆమె అలాంటిదుస్తులతో పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ, తొందరతొందరగా మునుచుకుపోతున్నట్లు సంగీతపాఠాలు చెప్పటానికి వెళుతున్నప్పుడు చూడటం జరిగితే, తప్పక ముసలి మఠాధిపతి గుర్తుకువస్తాడు.

(ప్రేక్షకులు లోపల చప్పట్లు కొడుతున్నారు.

"ఈసాయంకాలం నీవు నాతో గడపాలి" అన్నది పోలీన, లిస్టోవు దగ్గరకు వస్తూ. అతనివంక తదేకదృష్టితో కోపంగా చూస్తూ "మనం వెళ్ళి యిప్పుడు 'టీ' త్రాగాలి. తెల్సిందా? వినబడుతూవుందా? నీ వెంతో నాకు ఋణపడివున్నావు. నా యవ్వనపు తొలిరోజులు నీకు ధారపోశాను. నీతిగా నీవు దానిని కాదనటానికి నీకు అధికారం లేదు" అంది చాలా కఠినంగా.

"సరే, అలాగే" నని లిస్టోవు వప్పుకొన్నాడు.

గానసభ పూర్తి అయింది. జనం అంతా తొందరగా హాలువదలి వెళ్ళేట్లు లేదు. లిస్టోవు యూలియకు చెప్పకుండా వెళ్ళలేడు. అందువల్లనే అతను గేటువద్ద యూలియకొరకు ఎదురుచూస్తూ నిలబడివున్నాడు.

"నేను టీ కొరకు చచ్చిపోతున్నా. నా హృదయం దహించుకొని పోతూవుంది" అన్నది పోలీన విసుగుగా.

"ఇప్పటనే త్రాగవచ్చునుగా?"

"నేను డబ్బును అలా విసిరిపారవేసినట్లుగా ఖర్చు పెట్ట లేను. నేను లక్షలు లక్షలు సంపాదించి, పరుల రక్తాన్ని త్రాగే వ్యాపారస్తురాలను గాదు."

అతను ఆమెకు తన చేయి అందించబోయాడు. తను మగవారు తలంచుతూవుండే అబలలాంటి అబలనుగాదని, మగ వారి సహాయం తనకేమీ అవుసరంలేదని అన్నది. ఇదే సమాధానం, పూర్వంకూడ ఆమె ఎన్నోసార్లు యిచ్చింది.

అలా కటువుగా మాట్లాడుతూనే వచ్చేపోయే జనం వంక చూస్తూ, చేతులు వూపుతూ, వాళ్ళను పలుకరించు తూనే ఉంది. వారిలో కొందరామెకు తెల్సినవారు. కొందరు విద్యార్థి, విద్యార్థినులు.

"ఎవరిని నీవు పెండ్లాడింది?" గొణుగుతున్నట్లుగా అడి గింది పోలీన. నీ కళ్ళేమయినాయి. తెలివితక్కువమూర్ఖుడా, నీవు ఆ మూర్ఖపు అలగాపురుగులో ఏమి అందచందాలు, గొప్పతనం, తెలివితేటలు చూశావు? నేను నిన్ను నీ తెలివి తేటలు, నీ హృదయాన్ని చూసి ప్రేమించాను. కాని, ఆ చైనా బొమ్మకు కావలసినది నీవుగాదు; నీ డబ్బు. తెల్సునా?"

"దయవుంచి యిక వూరుకో, పోలీన" లిప్టోవు బ్రతి మాలుతున్నట్లుగా "నీవు నా వివాహంగూర్చి అనగల్గినదంతేగా. దాని ననేకసార్లు యిదివరకే నే ననుకున్నాను పోలీన. దయ వుంచి నీవేమీ నా హృదయ గాయాన్ని రేపకు" అన్నాడు.

యూలియ నల్లనిదుస్తులతో,కోష్టియా ఖద్దరు డ్రాక్టర్లు, ఒక ఆఫీసరు, విద్యార్థి దుస్తులతో లావుగావున్న కిష్ అనే వానితోను కలిసి బయటకువచ్చింది.

"కోష్టియతో యింటికి వెళ్ళు, నేను తరువాతవస్తా" నన్నాడు లిష్టోవు యూలియతో.

యూలియ, తలవూపుకొంటూ వెళ్ళిపోయింది. భయంతో వణకుతూ, అసూయతో, ద్వేషంతో, కోపంతో బాధతో పోలీన, యూలియ వెళ్ళినవైపు చూస్తూవుంది.

లిష్టోవుకు పోలీన యింటికి వెళ్ళటం యిష్టంలేదు. ఇంటికి వెళ్ళటం జరిగితే తిట్లు, చివాట్లు తప్పవని, ఏడ్పులు సాగుతాయని అతనికి తెలుసు. అందువల్లనే ఏదైనా హోటలుకు వెళ్ళదామన్నాడు.

"కాదు అలా వల్లకాదు. మాయింటికే వెళదాం, నా ముందెప్పుడూ హోటళ్ళను గూర్చి ఎత్తకు" అంది ఖచ్చితంగా.

మగవాళ్ళ చుట్టపొగ ఆమెకు పడకపోవటం అలా వుంచి, ఆమెకు ఒక ప్రత్యేకమైన అభిప్రాయం మగవాళ్ళను గూర్చి వుంది. తనకు తెలియని మగవాళ్ళను గూర్చి చాలా అసహ్యంగాను, వాళ్ళందరూ, నీతినియమములేని వ్యక్తులుగాను, వ్యభిచారులుగాను తలంచుతుంది. వాళ్ళంతా ఆమెకు కోపం గల్గించుతారని ఆమె దృఢవిశ్వాసం. అందువల్లనే ఆమెకు హోటళ్ళంటే తగని మంట.

ఒక టాక్సీని తీసుకుని, పౌలీన యింటికి బయలు దేరాడు. ఆమె అన్నది ముమ్మాటికి నిజం. అత నామె కెంతో ఋణపడివున్నాడు. అత డామెను మొదటిసారి తన స్నేహితుడు యార్టిస్కీ ఇంటిలో, యార్టిస్కీకి సంగీతం చెప్పటానికి వచ్చినప్పుడు కలుసుకొన్నాడు. ఆమె ప్రేమలో స్వార్థం లేదు. ఆమె నిష్కల్మషంగా, నిస్వార్థంగా లిస్టోవును ప్రేమించింది. వాళ్ళిద్దరూ కలసి నివసించే రోజులలోకూడా అలసిపోయే వరకు సంగీత పాఠాలు నేర్పి, తన ఖర్చులకు తానే సంపాదించు కుంటూ వుండేది. కానీ లిస్టోవు వద్దనుండి రాగిడబ్బుకూడా తీసుకునేదికాదు. ఆమె అతనికి సంగీతం విని ఆనందించగల జ్ఞానాన్ని కలుగజేసింది.

"నేను ఈ రోజునకూడా సంగీతం నేర్పటానికి వెళ్ళాను. వాళ్ళెంత మూర్ఖులంటేను? వాళ్ళవి వట్టి మట్టిబుఱ్ఱలు. విసుగుతో, కోపంతో నాకు చచ్చినంతపని అయింది, ఈరోజు. ఈ బానిసత్వానికి అంతం ఎప్పుడో తెలియకుండా వుంది. మూడు వందలు నిల్వచేసిన మరునాడే, ఏ బెడదా, గొడవా లేకుండా క్రిమియా వెళ్ళి బీచీలో పండుకొని హాయిగా చల్లనిగాలి పీలుస్తూ......సముద్రం అంటె నాకు చాలా యిష్టం."

"నీవు ఎప్పటికీ వెళ్ళలేవు" అన్నాడు లిస్టోవు. "అసలు నీ జన్మలో అంత డబ్బే నిల్వచేయలేవు. అదియుగాక నీకు డబ్బంటే తగనిమంట, ద్వేషం. ఏమీ అనుకోనకుండా వుంటే నాదొక సలహా—నీకు కావల్సినడబ్బు, పనిపాటలు లేని సోమరులకు సంగీతంనేర్పి తీసుకునేకంటే, నలుగురు స్నేహితులనుండి తీసుకోవడం మంచిది"అన్నాడు సలహా యిస్తున్నట్లు.

"నా కెవరూ స్నేహితులనేవారు లేరు. అలా చెత్త ఎప్పుడూ మాట్లాడకు. నేను శ్రామికవర్గానికి చెందాను. కష్టపడి బ్రతకటం నా జన్మహక్కు. అలా బ్రతకగల తెలివితేటలు నాకున్నాయికూడా. మోసకారులు, ధనవంతులు, వ్యాపారస్తులవద్ద ధనం తీసుకోవడం ఆత్మద్రోహం. లేదండీ,మీరెప్పుడూ నన్ను కొనలేరుసుమా. నేను యూలియను గానని మర్చిపోకండి."

పోలీన టాక్సీకి డబ్బుయిచ్చింది. లిప్ట్‌వృగనుక యివ్వబోతే, ఏదో ఒక రభస జరుగుతుందని, దెప్పుళ్ళు సాగుతాయని డబ్బుయివ్వకుండా మెదలకుండా వూరుకున్నాడు.

పోలీన ఒక చిన్నగది అద్దెకు తీసుకుని వుంటూంది. ఆ యింటి యజమానురాలు పోలీనాకు భోజనం ఏర్పాట్లుకూడా చేసింది, ఆ యింట్లోనే. ఒకనాటి విద్యార్థి. ఒకస్త్రీ నివశించే గదిగా కన్పించదు. డ్రస్సింగు టేబులుగాని, పుస్తకాలుగాని, డస్కుగాని ఏమీ లేవు. ఆ గది చూడగానే అక్కట నివసించే వ్యక్తి, ప్రతిరోజూ గదిలోనికి అడుగుపెట్టగనే నిద్రపోతుందని, నిద్రనుండి లేవగానే బయటకు వెళుతుందని అనిపిస్తూంది.

వంటమనిషి భోజనం తెచ్చాడు. పోలీన వణకుతూ టీ తయారుచేసింది. ఆ గదిలో చాలా చల్లగా వుంది. ఆమె కళ్ళు అలసటతో మూతలు పడుతున్నాయి. ఆమె ఒకటి – రెండు – మూడు కప్పుల టీ త్రాగింది.

"నీకు పెళ్ళయిందన్నమాట. నీ వేమీ నా గూర్చి విచారించవల్సిన అవసరంలేదు. నీ వంటే పడిచస్తాననుకోకు. నిన్ను ఒకనాడు, నా హృదయంనుండి తుడిచివేయగలను.

కాని నీవు అందరి మొగవాడిలాంటివాడవేనని, స్త్రీలో నీకు కావాల్సినది ఆమె శరీరం, యవ్వనమేగాని, తెలివితేటలు గాదని గుర్తుకొచ్చినప్పుడు నాకు చాలా బాధగా వుంటుంది. ఆమె అందం, ఆమె యవ్వనం..." యవ్వనం పలుసార్లు ముక్కుతో ఎక్కిరిస్తున్నట్లు, నవ్వుతూ అని మరల "యవ్వనం. నీవు కోరేది ప్రాఃప్రత్యేం, యవ్వనం. అవును అదే" అంటూ బిగ్గరగా కుర్చీలో వెనుకకు జార్లబడి నవ్వటం మొదలుపెట్టింది.

ఆమె నవ్వటం ఆపేటప్పటికి, ఆమె కళ్ళు రెండూ నీటితో నిండివున్నాయి.

"నీవైనా సంతోషంగా వున్నావా, కనీసం" అని అడిగింది.

"లేదు."

"ఆమె నిన్ను ప్రేమిస్తున్నదా ?"

"లేదు."

వ్యథతో విచారంతో, లిప్టోవు లేచి అటూ, ఇటూ తిరగటం మొదలుపెట్టాడు.

"లేదు. నిజం చెప్పాలంటె నేను చాలా దురదృష్ట వంతుడను పోలీన. నే నేమిచేయను. నేను చేయరాని తప్పు చేశాను. ఇంకా ఇప్పుడు చేయగల్గిందేముంది. ఇలా వేదాంతం మాట్లాడగల్గటంకన్న. అవును, ఆమె నన్ను ప్రేమించకుండగనే, నన్ను మూర్ఖంగా పెండ్లాడింది, ఆర్థిక ప్రలోభమువల్ల నేమో బహుశా. కాదు, కాదు పూర్తిగా మట్టుకు కాదు. ఆమె కూడా తన తప్పిదాన్ని తెల్సుకొని, చాలా బాధ పడుతూవుంటుంది. అది నేను తెల్సుకొనగలను. పగలు

కనీసం 5 నిముషాలయినా, నాతో కల్సియుండటానికిగాని, నా ఎదుట పడటానికిగాని చాలా భయపడుతూవుంటుంది. తప్పుకొని తిరుగుతూ వుంటుంది. అందువల్లనే వాటికని, వీటి కని ఎప్పుడూ బయటకు వెళుతూ వుంటుంది. నా ముందు చాలా భయపడుతూ, సిగ్గుపడుతూ వున్నట్లుగా మసలుతూ వుంటుంది."

"కాని నీ డబ్బు తీసుకొనటానికి సిగ్గు లేదా?"

"అదేమి కాదు పొలీన. నాది, ఆమెది అనే భేదమే లేద సలు. ఆమె చాలా మంచిది. సుస్వభావురాలు కూడా. తన తండ్రి యింటినుండి బయటపడటానికి నన్ను వివాహమాడి వుంటుంది."

"నీకు గనుక డబ్బు లేకపోతే, ఆమె నిన్ను వివాహమాడి వుండేదనా, నీ ఉద్దేశ్యం?"

"నాకేమి తెలియదు. నాకు దేనిలోను నమ్మకము లేదు. ఏమి అర్థంకాదుకూడా. దయయుంచి పొలీనా, నన్ను ప్రశ్నలువేసి వేధించకు" అని అన్నాడు, లిష్తోవు చాలా బాధతో, వ్యధతో, విచారంగా.

"నీవు ఆమెను ప్రేమిస్తున్నావా?"

"పిచ్చిగా."

చాలాసేపు యిద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. డాక్టర్ల క్లబ్బులో ఏ గొడవా లేకుండా భోజనం చేస్తుండే యూలియను గూర్చి ఆలోచిస్తూ అటూ, ఇటూ తిరుగుతూ, నాల్గవ కప్పు టీ త్రాగింది, పొలీన.

"ఏమీ తెలియకుండా, ఎరుగకుండా, ప్రేమించటం సాధ్యమా"? అని అడిగింది పోలీనా చేతులు త్రిప్పుతూ. "జంతు కామం కన్నా మరేమిలేదు. నీవు మోసపోయావు. ఆమె అందం, యవ్వనంవల్ల నీ కళ్ళుమూసుకు పోయినయి. వెళ్ళు, యిచ్చటనుండిపో, ఆమెవద్దకే పో, ద్రోహి," అంది చాలా కఠినంగా.

ద్వారంవైపు చూపుతూ టోపీ, కోటూ, అతనిపైకి విసరివేసింది. అతను నిశ్శబ్దంగా, కోటుతొడుక్కొని బయటకు వచ్చాడు. కాని అతనివెనుకనే పరుగెత్తి అతని భుజంపైబడి ఏడ్వడం మొదలుపెట్టింది.

లిప్టోవు ఆమెను సమాధానపర్చి, వదిలించుకొన ప్రయత్నించాడు.

ఆమె కళ్ళుమూసుకొనివున్నది. ముఖం పాలిపోయింది. వెక్కి, వెక్కి ఏడుస్తూనేవుంది. ఆమెను విడిపించుకోటం లిప్టోవుకు చాలా కష్టమయింది. ఆమెనెత్తుకెళ్ళిపరుపుపై పరుండబెట్టి పది నిముషాలు ఆమెను ఊరడిస్తూ ప్రక్కనకూర్చొన్నాడు. ఆమెచేతులు చల్లగావున్నాయి. నాడి చాలాబలహీనంగా, నెమ్మదిగా కొట్టుకొంటూవుంది.

"పో, యింటికి పో" అన్నది కళ్ళుతెరుస్తూ. "ఇచ్చట నుండి పోతావా, పోవా ? నీవెళ్ళకపోతే, నేను మరల ఏడ్వటం జరుగుతుంది. నేను కొద్దిగా విశ్రాంతి తీసుకోవాలి. లే, పో" అన్నది.

డాక్టర్ల క్లబ్బుకు వెళ్ళకుండా, లిప్టోవు పోలీనయింటినుండి, తిన్నగా యింటికివెళ్ళాడు. త్రోవలో, తనను మనసారా

ప్రేమించినట్లె, ఒక్కప్పుడు విడువలేని స్నేహితురాలుగా, భార్యగావున్న షాలీనాను ఎందుకు వివాహమాడలేదా అని కోపంగా తనలో తాను ప్రశ్నించుకొన్నాడు. తనను తానే ద్వేషించుకొన్నాడు. ఆమె అతనంటే ఎంతో ఆపేక్షగా, ప్రేమగా వుండేది. అదీగాక, అలాంటి తెలివితేటలుకల్గి కష్టించి, సగర్వంగా బ్రతుకగల్గిన వ్యక్తిని భార్యగా చేసుకొని, ప్రశాంత జీవితాన్ని కల్పించి ఆమె సుఖపెట్టకల్గటం ఆదర్శం గాదా? అందానికి, యవ్వనానికి విలువకట్టటానికి తానెవరు? తన తాహతెంత? తానెంత? అందనిపండుకొరకు పోయి, ఏవో కోరికలతో కలలుగని, యీనాడు ఏదోగా యీసురో మంటూ, బాధగా, వ్యధగా జీవితం గడుపవల్సివచ్చింది. కాలం గడచిపోతూనే వుంది. వైవాహికజీవితంలోకూడ తొలిరోజులు గడచాయి. కాని, యిప్పటికీ అతని భార్యను గూర్చి అతనికేమీ తెలియదు. ఆమెకు, ఆమె నాన్నకు, స్నేహితులకు పెద్దపెద్ద ఉత్తరాలు వ్రాయటానికి ఓపిక, కాలమూ వుంటుంది. కాని, తనతో ముచ్చటగా మూడు నిముషాలు మాట్లాడటానికి ఓపిక లేదా? వాళ్ళందరకూ వ్రాయటానికి మంచీ, చెడూ అనేక విషయాలుంటాయి. కాని, మురిపెంగా అనురాగంతో నాల్గుముక్కలు కూర్చొని మాట్లాడగల విషయాలే లేవా? ఎప్పుడైనా మాట్లాడటం జరిగితే వాతావరణంగూర్చి, భోజనానికి వేళైందని చెప్పటం తప్ప, మాటా-మంతీ ఏమీ వుండదా మాట్లాడటానికి? ఆమె పూజలు, పునస్కారాలు చేస్తూవున్నప్పుడు, చూసినప్పు డల్లా "ఆమె దేనికొరకు అలా ప్రార్థిస్తూ వుంటుంది?" అని

అనుకొంటూ వుండేవాడు. అలా ఆలోచిస్తూ యూలియను తిట్టాడు, తనను తాను తిట్టుకొంటూ. ఆమెతో రాత్రిళ్ళు సుఖించడానికి, ఆమెను అనురాగ ఆనందాలతో కౌగిలిలోనికి తీసుకొనటానికికూడ డబ్బుపెట్టికొని ఆనందాన్ని అనుభవిస్తున్నట్లుగా, కోరికలు తీర్చుకొంటున్నట్లుగా తలపోశాడు. అదే వ్యభిచారిణితో అయితే ఫర్వాలేదు. కాని యూలియ యవ్వనంలో వుంది; వయస్సులోకూడ చిన్నది. భయపడుతూ వున్నట్లు, చాలా నమ్రతగా వుంటూవుంటుంది. ఆమె అమాయికమైన చూపులు - యూలియను పెండ్లియాడినప్పుడు వాటన్నిటికీ చాల ముగ్ధుడై వివాహమాడాడు. కాని, యిప్పుడవి అన్నీ ఆమె నిజస్వరూపాన్ని దాస్తున్నవిగా తలంచాడు. అతని బ్రతుకు వృధా, నిష్ప్రయోజనం. భార్యాభర్త లిద్దరూ ఒకరిప్రక్క నొకరు కూర్చొని సినిమా చూస్తూవున్నప్పుడు, ఆమె ఎంతో సంతోషంగా-ఆనందంగా నవ్వుతూ వున్నప్పుడు, ఆమె ఎంతో స్వార్థపరురాలుగా, ఆమె తనతోపాటు ఆనందాన్ని పంచుకొనటంలేదని తలంచి బాధపడేవాడు. అసలు ఆమె అతని స్నేహితు లందరితోనూ చాల సరదాగానే వుంటుంది. వాళ్ళందరకూ ఆమె పూర్తిగా తెల్సు. కాని అతనుమట్టుకు బాధతో, అసూయతో, వ్యధతో అలా నిశ్శబ్దంగా వుండవల్సి వస్తుంది.

ఇంటికి తిరిగివచ్చి, లిప్టోవు బట్టలు మార్చుకొని నవల చదువుతూ కూర్చొన్నాడు. యూలియ యింకనూ యింటికి తిరిగిరాలేదు. అరగంట తరువాత యూలియ లోపలకు వచ్చి, తిన్నగా లిప్టోవు గదిలోనికి వెళ్ళి "అచ్చటేదో తగులబడుతూ

వుంది. ఆ మంటలవల్ల ఆకాశమంతా ఎఱ్ఱగా వుంది. నేనూ, కోష్టియ వెళ్ళి చూసిరామా ?” అని అడిగింది.

“తప్పకుండ.”

ఆమెలోని అమాయకత్వం, చిన్నపిల్లలా బెదురుతూ వున్న కళ్ళు లిస్టోవును చల్లబర్చాయి. మరొక అరగంట పుస్తకం చదివి నిద్రపోయాడు.

మరునాడు పోలీన, అతనివద్ద పూర్వం తీసుకొన్న పుస్తకాలు, వాళ్ళు వ్రాసుకొన్న ఉత్తరాలు, కలిసితీయించుకున్న ఫోటోలు ఋణం తీరిపోయింది (Basta) అనివ్రాసి, లిస్టోవుకు పంపివేసింది.

# 8

అక్టోబరు ఆఖరు రోజులలో నైనాస్థితి మరీ దిగజారిపోయింది. ఆఖరుదశలోకి వచ్చింది. బరువు తగ్గిపోయింది. మనిషి ముఖంలోకూడా చాలామార్పువచ్చింది. అంత బాధలో కూడా ఆమె ఆరోగ్యం బాగుపడుతుందని, ప్రతి ఉదయం ఆమె ఎంతో ఆరోగ్యవంతురాలిగా క్రొత్త బట్టలు ధరించి అలాగే మంచంమీద పండుకొని వుండేది. చివరి రోజులలో ఆమెకు మాట్లాడడం ఎక్కువయింది. అలా పండుకొనే ఎప్పుడూ ఏదో ఒకటి మాట్లాడుతూఉండేది. చావు అనుకొనకుండా అకస్మాత్తుగా వచ్చింది.

అది వెన్నెల రాత్రి. పిల్లలంతా స్నో (Snow) మీద ఆడుకొంటున్నారు. వాళ్ళ అల్లరి గదిలోకి బాగా వినిపిస్తోంది. నైనా పరుపుపై పండుకొనివుంది. సషా, ప్రక్కన ఏదో ఆలోచిస్తూ కూర్చునివుంది.

"అతని తండ్రిద్వారా వచ్చినపేరు నాకు గుర్తులేదు" నైనా నెమ్మదిగా చెప్పటం మొదలు పెట్టింది.

"అతనుక్రీస్టియను. పేరు ఇవాను. ఇంటిపేరు కొష్టివాయి. అతను గవర్నమెంటు ఉద్యోగస్తుడు. చాలా బీదవాడు. కాని, వర్ణించలేని త్రాగుబోతు. దేవుడు అతనిని క్షమించుగాక. మా వద్దకు ప్రతిరోజూ వస్తూండేవాడు. ప్రతి నెలా మేము టీ, పౌడరు, పంచదారా ఇస్తూండేవాళ్ళం. ఒకరోజు బాగా త్రాగి చచ్చిపోయాడు. అతనికొక కుమారుడు. చనిపోయేనాటికి కుమారునకు ఏడుసంవత్సరాలు. దిక్కూ మొక్కూ లేని అనాథుడు. మేము అతనిని తీసుకువెళ్ళి ఒక గుమాస్తా యింట్లో దాచాం. దరిదాపు సంవత్సరం వరకు ఆ సంగతి మా నాన్నకు తెలియదు. తెలిసిన తరువాతకూడా ఏమీ అనలేదు. అతను అనాథ బాలుడు. కొష్టియూ తొమ్మిది సంవత్సరాల వయస్సులో వుండగా— అప్పటికి నా పెండ్లి నిశ్చయమయింది. నేను అతనిని బడిలోనికి తీసుకొని వెళ్తూండేదానను.

తరువాత ఎవరూ అతనిని బడిలోనికి తీసుకొని వెళ్ళే వారుగాదు. అందువల్లఒకరోజు ఏడ్చాడు. "ఎందుకు ఏడుస్తావు" అంటూ నేను రాజగులాయిలోవున్న బడికి తీసుకొనివెళ్ళాను. అలోష జీతం కట్టుతూండేవాడు. ఎలాగయితేనేమి కష్టపడి చదివిపైకివచ్చాడు. ఇప్పుడు తను మాస్కోలో ప్లీడరు. అలోషి

యాకు స్నేహితుడు. అతనివలె బాగా చదువుకొన్నవాడు. అలాంటివానికి సహాయం చేయటం చాలా మంచిపని అనుకుంటూ...అతనికి ఇప్పటికి మేమంతా జ్ఞాపకముండివుండాలి. అవును..."

ఆమె గొంతుక అంతగా వినిపించటములేదు. కొద్దిసేపు తర్వాత ఆమె అగస్మాత్తుగా మంచంమధ్య లేచి కూర్చున్నది.

"ఏమిటో – నేను బాగా నేవున్నాను. నేను గాలి పీల్చ లేకుండావున్నా" నన్నది.

సషాకు అనుమానంవేసింది, తన తల్లి చాలా కొద్ది కాలంలో తమను విడిచిపోతుందని. అంటుకుపోయిన బుగ్గలు, పీక్కుపోయిన కళ్ళు, సషా అనుమానాన్ని మరీదృఢపరిచాయి. చాలా భయపడింది కూడా.

"అమ్మా, అమ్మా, మమ్ముల...వదలి అమ్మా" అంటూ ఆవురుమని ఏడ్చింది.

"తొందరగా పరుగెత్తి ఎవరినైనా పంపించి మీ నాన్నగార్ని పిలిపించమ్మా..."

సషా పనిమనుషులకొరకు అంతా వెదికింది. ఎవరూ లేరు. లిడమాత్రం ఒక పెట్టెమీద దిండుకూడా లేకుండా పండుకొని నిద్రపోతూంది. సషా కోటు కూడా తొడుక్కోనకుండా, బయటకూర్చొని పిల్లల ఆటలు చూస్తున్న నర్సువద్దకు పరుగెత్తింది.

"నర్స్, నర్స్ అమ్మ ప్రాణాలు పోతున్నాయి, నాన్న గార్ని పిలిపించాలి" అంది ఏడుస్తూ.

నర్సు పైన నైనా వద్దకు వెళ్ళింది. సషా ఎవరినో ఒకరిని తండ్రివద్దకు పంపుటకు పిచ్చిదానివలె అటూఇటూ పరుగెత్తుతూంది. చివరికి ఆమే బయలు దేరింది. తన తండ్రి పరస్త్రీతో, ఇద్దరి పిల్లలతో "బజార్నయి" బజారులో వున్నాడని ఎవరో పనిమనుష్యులు చెప్పుకుంటూండగా విన్నది. ఏడుస్తూ, వచ్చేపోయేవాళ్ళను చూసి సిగ్గుపడుతూ చలితో వణుకుతూ, "సషా" తండ్రి కోటును నెతుక్కుంటూ బయలు దేరింది.

బండి ఎక్కకుండా నడిచి వెళుతూవుంది. బండివాడు ఆమెను ఎచ్చటికో తీసుకొని వెళ్ళి, డబ్బు, బట్టలు, లాక్కొని చంపివేస్తాడని భయం. ఆమె అలాంటి కథలను చాలా పని మనుష్యుల ద్వారా విన్నది. ఏడుస్తూ, అలసటగా, ఊపిరాడకుండా, ఆమె పరుగెత్తుతూంది. బజారు వద్దకు వెళ్ళిన తరువాత ఒకఅమ్మాయిని తన తండ్రి ఎచ్చటయుండేదీ అడిగింది. ఆ అమ్మాయి ఎంత విపులంగా చెప్పినా "సషా"కు అర్థం కాకపోవుటవల్ల, ఆ అమ్మాయే "సషా" వేలుపట్టుకొని ఒక ఇంటివద్దకు తీసుకొని వెళ్ళింది. అప్పుడు తన తండ్రి భోజనం ముగించి, ఒక స్త్రీతో, ఇద్దరి పిల్లలతో కల్సి టీ త్రాగుతూవున్నాడు, "సషా" తండ్రిని చూచి వెక్కి, వెక్కి. ఏడ్వడముతప్ప మరేమీ చెప్పలేక పోయింది. అదిచూసి ఫనర్వా విషయం ఏమిటో పూర్తిగా గ్రహించాడు.

"అమ్మనా, ఎలావుంది చెప్పమ్మా అని అడిగాడు.

త్వొందరగా టాక్సీ తీసుకొని తండ్రి, కూతురు తిరిగి వచ్చేటప్పటికి "నైనా" దీపం చేతిలో పెట్టుకొని, చుట్టూరా

దిళ్లసహాయంతో కూర్చొని యున్నది. ఆమె ముఖం నల్లబడి, కళ్ళుమూసుకొని పోయివున్నాయి. పడకగదిఅంతా జనంతో నిండివుంది. నన్సుపనివాళ్ళకు ఏవో పనులు చెపుతూవుంది. పని మనుష్యులంతావిచారంగాగుమ్మాలుపట్టుకొని నిల్చునివున్నారు. "లిడ" గదిచివర ఒకమూల, నిద్రమత్తుతో, ఆశ్చర్యంగా, ఏమీ అర్థంగాక, అమ్మవంక తదేకదీక్షతో చూస్తూ విచారంగా నిల్చొనివుంది.

ఘనర్వా నైనా చేతినుండి దీపంతీసుకొని "నీవు పండుకో నైన, అసలు నీవు పండుకోవాలి" అన్నాడు ఎంతోఆప్యాయ, అనురాగాలతో.

నైన అతనివంక చూసింది గాని గుర్తుపట్టగల స్థితిలో లేదు.

మతాధికారి, డాక్టరు వచ్చారు. అప్పటికే అచ్చట చేరినవారు నైన ఆత్మశాంతికి ప్రార్థనలు చేయ సాగారు.

"ఖర్మ, ఇంకా నలభై సంవత్సరాలన్నా రాలేదు, అప్పుడే చనిపోవటం, కాలవైపరీత్యం, దురదృష్టం" అన్నాడు డాక్టరు.

చిన్నపిల్లలు ఏడుస్తూ వున్నారు. ఘనర్వా తెల్ల ముఖంతో, కన్నీళ్ళతో విచారంగా డాక్టరువద్దకువచ్చి వణకుతున్న గొంతుకతో, నెమ్మదిగా "డాక్టరుగారూ, నా కొక సహాయం చేయాలి. మాస్కోకు టెలిగ్రాము యివ్వండి, నా కేమీ పాలుపోకుండావుంది" అన్నాడు.

డాక్టరు తన కూతురుకు "నైన, సాయంకాలం 8 గం. లకు చనిపోయింది. అప్పులవల్ల యిల్లు వేలంకు వచ్చింది.

వేలం 12 వ తారీఖున. తప్పక వేలంనాటికి రావాలని నీ భర్తతో చెప్పు" అని టెలిగ్రాం యిచ్చాడు.

# 9

లిప్టోవు మలయా బజారులో ఒక పెద్దయిల్లు అద్దెకు తీసుకొని వుంటున్నాడు. దాని ప్రక్కయిల్లుకూడా అతని క్రిందేవుంది. దానిలో ఒక భాగంలో అతనిస్నేహితుడు కోప్టియా రెండవభాగంలో ఒక ఫ్రెంచి కుటుంబం-భార్యా, భర్త, అయిదుగురు పిల్లలు-వుంటున్నారు.

ఆరోజు చాలా చలిగావుంది. కోప్టియా లేవగానే, భయపడుతూ, ఏదో మందు తొందరతొందరగాతీసుకుని, కొన్ని ఆసనాలు వేశాడు. అతను సన్నగా, పొడుగ్గా, పెద్ద మీసాలుగల్గి వుంటాడు. అసలు గమ్మత్తు ఏమిటంటే, అతనికాళ్ళు ఊహించ లేనంత పొడుగ్గా వుంటాయి.

పనిమనిషి, ఫిమోటకు కాఫీ తీసుకొనివచ్చాడు.

"ఈరోజు చాలా బాగుందండి" అన్నాడు.

"అయితే కావచ్చు. కాని అంతగా ఆనందించ వలసినది నాకేమీ కన్పించలా."

ఫిమోటకు ఒకవేడి నిట్టూర్పు విడిచాడు.

"ఆ పిల్లలేమయినారు?" అనిఅడిగాడు కోప్టియా.

అలెక్సీ పాఠాలు చెబుతూ వున్నారు.

కోష్టియా కిటికీగుండా ఓపెరా కళ్లజోడుతో, ఫ్రెంచి వారుండే భాగంలోకి చూశాడు.

"నాకేమీ కన్పించటము లేదు."

సషా, లిడ, ఆరువారాలనుండి మాస్కోలోనే వుంటున్నారు. వాళ్ళ చదువుకు ఒక మాష్టర్ని పెట్టారు. సషా న్యూటెష్టుమెంటు చదువుతూవుంది. "లిడ" ఓల్డు టెష్టుమెంటు మొదలుబెట్టబోతూ వుంది.

యాడమ్ యీవుకు, యిద్దరుకొడుకులు. వాళ్ళ పేర్లేమిటని లిప్టోవు అడిగాడు.

లిడ తెల్లముఖం పెట్టి, ఏదోగొణుగుతూ, బల్లవంక చూస్తూవుంది. సషా, లిడవంక చూస్తూవుంది.

"నీకు తెల్సు, భయపడుతున్నావు, అంతే, చెప్పమ్మా" అని అడిగాడు లిప్టోవు.

"అబల్, కేబల్" అన్న దావిడ.

"కెయిన్, అబెల్" అని లిప్టోవు సరిచేశాడు.

లిడ ఏడ్వటం మొదలుపెట్టింది. సషా కూడా ఏడ్వ సిద్ధంగావుంది. లిప్టోవు జాలివల్ల ఏమీ అనలేక, సిగరెట్టు ముట్టించుకొన్నాడు. కోష్టియా అప్పుడే వార్తా పత్రికతో లోపలికి వచ్చాడు

"కోష్టియా, కాస్త వీళ్ళకు పాఠాలు చెబుదూ, ఇంకా కొద్దిసేపుంటే, నేను కూడా ఏడుస్తానేమోనని భయంగా వుంది. నేను షాపుకు కూడా వెళ్ళాలి" అన్నాడు లిప్టోవు.

కోష్టియా పాఠాలు చెప్పటం మొదలుపెట్టాడు.

లిడబిగ్గరగా ఏడ్వనారంభించింది. ఖంగారుగా కోష్టియా కుర్చీనుంచి లేచాడు.

"నేను మా నాన్నగారి వద్దకు వెళతాను" అంటూ లిడ ఏడుస్తూంది.

సషా కూడా ఏడ్వటం మొదలుపెట్టింది. కోష్టియా, యూలియాను ఫోనులో పిల్చి "పిల్లలు మరల ఏడుస్తున్నారు, ఏం చేయాలో నా కేమీ అర్థం కావటం లేదు" అని చెప్పాడు.

యూలియ తిరిగివచ్చి "ఇదిగో చూడండమ్మా నాన్న గారు ఈ రోజు వస్తున్నట్లు టెలిగ్రాము వచ్చింది. అమ్మ విషయం మనము ఏమి చేయగలము. అంతా దేవునిదయ" అన్నది బ్రతిమాలుతూ.

వాళ్ళు ఏడ్పుమానగనే బజారులో అటూ ఇటూ తిప్పుకురావటానికని కారులో తీసుకొని వెళ్ళింది.

లిప్టోవువాళ్ళు 2,3 గంటలమధ్య భోజనం చేస్తారు. ఫియోటరు వడ్డించుతూంటాడు. "ఫియోటరు"కు తెలియని పని అంటూ లేదు. పోస్టాఫీసుకు, షాపుకు పరుగెత్తుతూ వుంటాడు. కోష్టియా, పనుల మీద కోర్టుకు వెళ్ళుతూ వుంటాడు. వడ్డనచేస్తూ వుంటాడు. సిగరెట్లు తయారుచేస్తూ వుంటాడు. వచ్చిన అతిథులకు మర్యాదచేస్తాడు. ఇన్నిపనులు చూస్తూ మరల తెల్లవారి 5 గంటలకు లేస్తాడు. ఎప్పుడు నిద్రపోతాడో ఎవరికీ తెలియదు. సోడా సీసాలు ఓపెన్ చేయటం అంటే అతనికి మహాసరదా. ఒక చుక్కయినా బయటికిపోకుండా నేర్పుగా ఓపెన్ చేస్తాడు.

"అహహా" అన్నాడు కోప్టియా, ఓడ్కాగ్లాసును భోజనానికి ముందు త్రిప్పుతూ.

యూలియాకు మొదట్లో కోప్టియా అంటే యిష్టముండేదికాదు. "తన్నండి వెధవను", "చెత్త" అనే అతని మాటలు ఒక విధమైన అతని గొంతుక, ఓడ్కాగ్లాసు, ఇతర గ్లాసులను కొట్టటం, ప్రతిగ్లాసు త్రాగేముందు పెద్దఉపన్యాసం దంచటం ఆమెకు ఏమాత్రమూ నచ్చేదికాదు. అతనంటే చాలా తేలిక అభిప్రాయం ఏర్పడింది. తర్వాత్తర్వాత అతని నైజాన్ని తెల్సుకొన్నప్పటినుండి, అతనితో చాలా సరదాగానే వుంటూండేది. అతను ఆమెతో ఏమీ దాపరికం లేకుండా, నిష్కల్మషంగా వుండేవాడు. అతనికి సాయంకాలంపూట ఆమెతో కూర్చొని, పిచ్చాపాటీ మాట్లాడటం అంటే ఎంతో సరదాగా వుండేది. ఎవరికీ చూపించకుండా దాచిన అతను వ్రాసిన పుస్తకాలు ఆమెకు చదవటానికి యిచ్చేవాడు. ఇప్పుడుఆమెకు కూడా అతనిని కష్టపెట్టటం యిష్టంలేదు, నవలలన్నీ బ్రహ్మాండంగా వున్నవనేది.

ఒకనాటికి గొప్ప రచయితనవుతానని అతనినమ్మకం. అతను యెప్పుడూ పల్లెప్రాంతాలలో వుండకపోయినా, పల్లెలనుగూర్చి, కార్మిక కర్షకులను గూర్చి అతను ఎంతో చక్కగా పుస్తకాలలో వ్రాస్తూండేవాడు. ప్రేమనుగూర్చి వ్రాయటంగాని, సృష్టి, ప్రకృతినిగూర్చి ఏదో పొగడుతూ వ్రాయటంగాని అతనికి అంత ఇష్టముండదు. అందువల్లనే అతని పుస్తకాలలో ఆగోష్ఠవ వుండదు. అతని నవలలు ప్రచురించబడలేదు. దానికతను 'సెన్సారు' వాళ్లని దూషించు

కాడు. అతను ప్లీడరుగా వుండటము అతనికి ఇష్టమేగాని అతనివృత్తి "సాహిత్యసేవ చేయటం, రచనలు సాగించటం"గా తలుస్తాడు. అతనికి కళాకారున కుండవల్సిన లక్షణా లున్నాయని అతని ఉద్దేశము. అతనికి సంగీతంగూర్చి ఏమీ తెలియకపోయినా అన్ని గానసభలకు వెళుతూ వుంటాడు. వాళ్ళందరితో పరిచయంకూడా కల్గి వుంటాడు.

భోజనాలవద్ద లిప్టోవు, అతని అన్న "ఫాయిడర్" ఎలా మారిపోయిందీ, అతని వేషభాషలు, మాట్లాడు పద్ధతి మొద లగువాటిని గూర్చి అన్నలోని పరివర్తననుగూర్చి ఆశ్చర్య పడుతూ చెప్పాడు.

తర్వాత భోజనంవద్దనుండి లేచి లైబ్రరీలో కూర్చుని "ఫనర్వో" కొరకు ఎదురుచూస్తున్నారు. ఏమాత్రం చప్పు డయినా తండ్రి వస్తున్నాడని, చిన్న పిల్లలు ఇద్దరూ ఎంతో ఆతురతగా, విచారంతో తండ్రికొరకు యెదురుచూస్తూ కూర్చున్నారు.

మరీ సాయంకాలం టప్పుడు పిల్లలకేమీ తోచేది కాదు. పెద్దవాళ్ళు పిచ్చాపాటీ మాట్లాడుతూ, నవ్వుతూ వుంటే వాళ్ళతల్లి చనిపోయినతర్వాత ఎవరయినా అలా సరదాగా మాట్లాడుతూ, నవ్వుతూ ఎలా వుండగలరో అనేది వాళ్ళకు అర్థంగాని విషయం.

"నీవు ఈ రోజున కిటికీనుండి ఏమిచూశావు" అని యూలియ, కోస్టియాను అడిగింది. "ఈరోజున ఏమీచూడ లేదు కాని నిన్న ముసలిఫ్రెంచివ్యక్తి స్నానంచేస్తూండటం" చూశాను.

ఏడుగంటలప్పుడు కోస్టియా, యూలియ సినిమాకు వెళ్ళారు లిప్టోవు ఒక్కడే పిల్లలతో ఇంటివద్దవున్నాడు.

"నాన్నగారు, ఈపాటికివచ్చివుండాలి. రైలురావటం ఆలస్యమైవుంటుంది" అన్నాడు లిప్టోవు గడియారం వంక చూస్తూ.

పిల్లలు నిశ్శబ్దంగావున్నారు. చలితో బాధపడుతున్న జంతుపిల్లల్లా కౌగలించుకొని, పడకకుర్చీలో పండుకొని వున్నారు. ప్రతికొద్దిసేపుకు గోడగడియారంవంకచూస్తూ లిప్టోవు అటూ, ఇటూ తిరుగుతున్నాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. దాదాపు పదిగంటలప్పుడు తలుపువద్ద శబ్దంవినబడగా "ఫియొటరు" వెళ్ళితలుపు తెరిచాడు.

తండ్రిగొంతుక వినిపించగానే, చిన్నపిల్లలు, బిగ్గరగా ఏడుస్తూ, తండ్రివద్దకు పరుగెత్తారు. అతనుచాలా ఖరీదయిన కోటును తొడుక్కొనివున్నాడు.

ఫనర్యో కూడా కన్నీరుపెట్టుతూ, నవ్వుతూ, పిల్లలను ముద్దెట్టుకుంటూ, ప్రేమగా సముదాయించి, లాలనగా మాట్లాడాడు. పిల్లలుకూర్చుని చదువుకునేగదిలోనికివెళ్ళి "నేను యిచ్చట ఎక్కువకాలం వుండటానికి వీలులేదమ్మా. నేనురేపు త్వరగా "పీటర్సుబర్గు" వెళ్ళాలి. అచ్చట నాకింకొకపట్టణంలో ఉద్యోగము యిస్తామన్నారు" అన్నాడు చేతులు నలుపుకొంటూ.

అతను 'ప్రెసిడెన్'లో ఆగాడు.

# 10

యార్టిస్కీ తరచుగా లిప్టోవు ఇంటికి వస్తూంటాడు. అతను చాలా దృఢకాయుడు, నల్లని వెంట్రుకలు, ఎప్పుడూ అతని ముఖం సరదాగావుంటుంది. అతనిని చాలామంది గొప్ప అందగాడని అనుకొంటారు కాని ఈమధ్య చాలా లావెక్కుట వల్ల అతని ఆకారంలో చాలా మార్పువచ్చింది.

మొదట లిప్టోవు వాళ్ళతోనే చదివాడు. తరువాత సైన్సు అభిమాన శాస్త్రంగా తీసుకొని రసాయనికశాస్త్రంలో డిగ్రీని సంపాదించాడు. అతను ఏ లేబొరేటరీలోను పనిచేయడం లేదు. స్కూళ్ళల్లో పదార్థ విజ్ఞానశాస్త్రము, చరిత్ర, బోధించుతున్నాడు. అతను విద్యార్థులంటె, ప్రత్యేకంగా ఆడపిల్లలంటే చాలా సరదాగా వుంటాడు. అతను స్వయంగా సోషియాలజీ, రష్యనుచరిత్రకూడా చదివాడు. అతనెప్పుడు వృక్షశాస్త్రం గూర్చిగాని, జంతుశాస్త్రంగూర్చిగాని మాట్లాడటం జరిగతే ఒక చరిత్రకారుడిలా మాట్లాడతాడు. చరిత్రనుగూర్చి మాట్లాడేటప్పుడు వైజ్ఞానవేత్తగా మాట్లాడతాడు.

లిప్టోవుకు ఇంకొక స్నేహితుడు "కిష్". అతడు ఆజన్మాంతర విద్యార్థి. ప్రతిరెండు సంవత్సరాలకు సబ్జక్టు మారుస్తూవుంటాడు. 3 స॥లు మెడికల్ స్కూలులో చదివి, మానివేసి, మరల లెక్కలు తీసుకొన్నాడు. వాళ్ళ నాన్న ప్రతినెల 40 రూబులులు పంపుతాడు. వాళ్ళమ్మ రహస్యంగా మరొక 10 రూబులులు పంపుతూండేది.

కిమ్ హాయిగా, నిశ్చింతగా, ఖుషామత్తు చేస్తూ, మాస్కోలో, ఆ డబ్బుతో కాలం గడుపుతూండేవాడు. అతను పొట్టిగా, శుభ్రంగావుంటాడు. ఎప్పుడూ ఏదో ఒకటి పరోప కారార్థం సహాయం చేస్తూనే వుంటాడు. చందాలకొరకు తిరుగుతూ వుంటాడేమో, చాలామంది జనం వున్నప్పుడు ఏ సినిమాహాలు టిక్కెట్లు కిటికీవద్దో, ఆవరుసలో ఎవరొక అమ్మాయికి టిక్కెట్టుకొరకు వేచివుండటమో చేస్తూంటాడు.

ప్రజలు చాలామంది వాళ్ళకు ఏ పనివచ్చినా "మన కిమ్ వున్నాడుగా తప్పక చేసి పెడతాడు" అని అంటూవుంటారు. ప్రజలు అడగాలేగాని అతను కాదనేవాడుకాదు. ఎవరయినా ఏదయినా తెచ్చిపెట్టమన్నప్పుడు వాళ్ళు డబ్బులు యివ్వక పోయినా అతనికి అడిగే అలవాటు లేదు. నిట్టూర్పువిడిచి వూరు కుంటాడంతే. అతనికి సంభాషణలలో ఎలా పాల్గొనాలో తెలియదు. సరదాగా అందరిని నవ్వించటం అంతకన్నా చేత గాదు. ఏ ప్రొఫెసరైనా చనిపోవటము జరిగితే తప్పకుండా స్మశానానికి వెళ్ళే వాళ్ళల్లో ముందు వుంటూ వుండేవాడు.

యార్ట్సెవ్, కిమ్, తప్పకుండా ప్రతిసాయంకాలం లిస్టోవు ఇంటికి, టీకివస్తూ వుంటారు. లిస్టోవు వాళ్ళుకూడా బయటకు ఎక్కడికి వెళ్ళవలసిన అవసరం లేకుండా వుంటే భోజనాలకు కూడా అచ్చట నేవుండి, పిచ్చాపాటీ మాట్లాడుతూ, వాదనలు చేసుకుంటూ కూర్చుని వుంటారు. ఒకనాడు అలా కూర్చుని వుండగా కళను గూర్చి మాట్లాడటం మొదలుపెట్టారు.

"ఏదైనా సంఘాన్ని, సమస్యను చూపెట్టేదయితేనే అదికళ అవుతుంది. అది సంఘ దోషాలనుగాని, బూర్జువాల

దోపిడినిగాని, ఏదో ఒకటి రచయిత కోపాన్ని వెళ్ళ బుచ్చ కలిగిన దయితేనే అది ఎక్కువకాలం కళగా బ్రతకగలుగు తుంది. ప్రేమనుగూర్చి వ్రాసే పుస్తకాలు ఎందుకూ పనికి రావు. సమాజ వికాసానికి ఏవిధంగాను సహాయపడవంటూ" గంభీర ఉపన్యాసం దంచాడు కోష్టియా.

"నీతోనే నేకీభవిస్తాను కోష్టియా. ఒకరు ప్రేమికుని ప్రేమ ప్రయత్నాలు మొదలగు వాటిని గూర్చి వ్రాస్తే, మరియొకరు ప్రేయసీ, ప్రియుల అపార్థాలనుగూర్చి వ్రాస్తారు. మరొకరు ముచ్చటగా వాళ్ళను కలుపుతూ వ్రాస్తారు. అవి తప్ప ఇంకేమి వ్రాయటానికి లేవా ఈ ప్రపంచంలో ? అలో లక్ష్మణా అంటూ ఆకలి బాధతో అలమటించే అనాధులు, భవిత అనేది ఎరుగకుండా అద్దమైన రోగాలతో యిస్సురో మంటూ బ్రతికే ప్రజానీకం గూర్చి ఎందుకు వ్రాయరు? నిద్రాభిమై వున్న విప్లవజ్యోతిని వారిలో ఎందుకు రగులు కోల్పరు ?" అన్నది యూలియ ఆవేశంతో.

లిస్టోవుకు, ఇరువది సంవత్సరములు కూడా లేని తన భార్య ప్రేమ అంటె అంత వ్యతిరేకంగాను, విప్లవ పూరితంగా మాట్లాడటం యిష్టం లేదు. దానికి కారణం ఏమిటో తాను ఊహించ గలననుకున్నాడు.

"పద్యాలు, సమస్యలును తీర్చకపోతే మరింకొకటి ఏది? న్యాయశాస్త్ర పుస్తకాలు, వైజ్ఞానశాస్త్ర పుస్తకాలు, పని కొస్తవేమొ!" "రోమియో అండ్ జూలియట్" లాంటి పుస్త కాలలో ప్రేమను గూర్చిగాక, ఇతర జైళ్ళలోని అంటురోగా

లను గూర్చి వ్రాసి వున్నట్లయితే ఎంత హాస్యాస్పదంగా వుంటుందో తెల్సా" అన్నాడు యార్ట్సిస్వీ.

"నీవు చాలాదూరం పోయావు యార్ట్సిస్వీ. మేము మాట్లాడుతున్నది షేక్సిపియర్ లాంటి మహాకవులనుగూర్చి కాదు, వందలకొలదిగావున్న తెలివిగల మధ్యరకపు రచయితలనుగూర్చి. వాళ్ళు ప్రేమనువదలి ప్రజానీకానికి అందుబాటులో ఉద్దేశాల, ఆశయాలతో వ్రాసినట్లయితే ఎంతో ఉపయోగంగా వుంటుంది" అన్నాడు కోష్టియా.

కిష్ ముక్కుతో తా నీ మధ్య చదివిన కథనుగూర్చి చెప్పటం మొదలుపెట్టాడు. అతడు నెమ్మదిగా, ధైర్యంగా, ఎంతో వివరంగా చెప్పుకుపోతున్నాడు. 3, 5 కాదు - పది నిమిషాలయిపోయింది. దానికి అంతమూ లేదు; ఎవరూ వినటమూ లేదు. అది ఏమిటో ఎవరికీ తెలియనూ తెలియదు. తాను చెప్పుకుపోతూవున్నకొలదీ అతను చెప్పు విధానము వినటానికి చాలా కటువుగావుంది.

"కిష్, నీ కథతో మమ్ములను చంపుతున్నావు, త్వరగా పూర్తిచేయి" అన్నది యూలియ.

"దయయుంచి కిష్" అన్నాడు కోష్టియా. అంతా నవ్వారు. కిష్ కూడా నవ్వాడు.

ఇంతలోకి ఫాయిడర్ లోపలికి వచ్చాడు - తొందర, తొందరగా అందరితోను కరచాలనంచేసి తమ్ముణ్ణి ప్రక్కగదిలోనికి తీసుకొనివెళ్ళాడు. ఈమధ్య ఫాయిడర్ నల్లురిలోను కూర్చొనటం మానివేశాడు.

"కుర్రవాళ్ళను అనుభవించనీ; నేను, నీవు హాయిగా ఇచ్చట కూర్చుని మాట్లాడుకొందాము" అంటూ ఫాయిడర్ పడకకుర్చీలో కూర్చుని, "కారణం ఏమిటి బ్రదర్, నీవు యీ మధ్య షాపుకురావటము మానివేశావు; నిన్ను చూచి చాలా రోజులయింది. నీవు షాపుకువచ్చి వారం రోజులుపైన అయిందిగదూ!" అన్నాడు.

"అవును. నాకేముంది అచ్చట చేయటానికి. అదీగాక నిజం చెప్పాలంటే ముసలాయనను చూస్తే నాకు మండుతుంది" అన్నాడు.

"అవును, మనిద్దరము వెళ్ళకపోయినా పని జరుగుతూనే వుంటుంది. కానీ ప్రతివాడు ఏదో ఒకపని చేయాలిగా. ఎవరైతే కష్టించి, చెమటోడ్చి సంపాదించుతారో వారే తినాలి, బ్రతకాలి. అలా కష్టించి బ్రతికేవాళ్ళనే దేముడు ప్రేమించుతాడు" అన్నాడు.

ఫియోటర్ ఒక గ్లాసు టీ తీసుకొనివచ్చాడు. ఫాయిడర్ పంచదార లేకుండానే టీ త్రాగి మరొకకప్పు కావాలని అడిగాడు. అతనెప్పుడూ ఎక్కువగా టీ త్రాగుతాడు. ఒక్కొక్కసారి సాయంత్రంలోపు దాదాపు 10 కప్పులు టీ త్రాగుతాడు.

అతను తన తమ్మునికి దగ్గరగా జరుగుతూ "అలెక్సీ, నీవు ఎందుకు కౌన్సలరుగా పోటీ చేయకూడదు? తర్వాత డిప్యూటీ మేయరు అనవచ్చు. నీవు చదువుకున్నవాడవు. తెలివిగలవాడివి. నిన్ను ప్రజలు గుర్తిస్తారు, గౌరవిస్తారు.

అనేకచోట్లకు ఆహ్వానించబడతావు. నీకు 50 సంవత్సరములు రాకపూర్వమే చాలా ఉచ్ఛదశలో వుంటావు" అన్నాడు.

లిస్టోవు నిశ్శబ్దంగా కూర్చున్నాడు. ఫాయిడర్‌కు అలాంటివి మహాయిష్టం. అతనికి సమాధానం ఏమి చెప్పాలో అర్థం కాలేదు.

ఫాయిడర్ గడియారంతీసి తదేకదృష్టితో తిరుగుతున్న ముళ్ళవంక చూస్తున్నాడు. అతను అలా చూడటం లిస్టోవుకు గమ్మత్తుగాను, ఆశ్చర్యంగాను తోచింది.

భోజనానికి లేవమని పిలుపు వచ్చింది. లిస్టోవు భోజనాల గదిలోకి వెళ్ళాడు. ఫాయిడర్ అలాగే కుర్చీలో కూర్చుని వున్నాడు. భోజనాలదగ్గర ఏమీ వాదనలు లేవు.

కొద్దిసేపు తర్వాత యార్టిస్కీ ఉపన్యాసకుడిధోరణిలో "వాతావరణములో, రుచులలో, శక్తులలో భేదాలవల్ల శారీరకంగా అంతా సమానంగావుండడం అనేది జరగని విషయం. తెలిసినవాళ్ళకు ఎవరికైనా అర్థమవుతుంది. యిలాంటి అసమానతవల్ల ఏమీ ప్రమాదం లేదని మనందరికీ తెల్సు. పిల్లి, ఎలుకలు ఒకే కంచములో కల్సి తినేటట్లుగా తయారుచేసిన విజ్ఞానవేత్తలగూర్చి, అలాగే చదువూ, విజ్ఞానం కూడా మానవులలో అలాంటి ప్రవృత్తినే పెంపొందించగలదని నా నమ్మకం. కాలం ముందుకు నడుస్తూవుంది. సాంస్కృతికంగా మనం అంతా ముందుకు వెళ్తున్నాం. ఈనాటి ఫ్యాక్టరీ పనివాడుకూడా భాగ్యవంతుల్లా తయారయ్యేకాలం మనము చూడవచ్చు" అన్నాడు.

"అలాంటి కాలము మనము చూడబోము" అంటూ ముసిముసి నవ్వులు నవ్వుతూ "రాత్ బైల్డు, వాల్టును కని పెట్టడానికి చాలాకాలం పట్టింది. అప్పటివరకు కార్మికుడు ఎంతో కష్టపడవల్సి వచ్చింది. అదేమి లాభంలేదు సార్, మనం అలా కాలనిర్ణయంకొరకు ఎదురుచూస్తూ వుండలేము. మనం పోరాడవల్సిందే. పిల్లి, ఎలుక తిన్న పళ్ళెంలో తినటం వల్ల నీ ఉద్దేశంతో పిల్లి తనతప్పు తెల్సుకొన్నదనా? అదేమీ కాదు. అదంతా బలవంతమువల్ల, వేరేమార్గం లేకపోవుటవల్ల, వేరేగత్యంతరం లేకపోవుటవల్లను, అలా జరిగింది" అన్నాడు కోప్టియా.

"నేను, ఫాయిడర్ భాగ్యవంతులము. మా తండ్రొక బూర్జువా. కాబట్టి ప్రజలు మాతో పోరాటం జరపాలి" అంటూ లిప్టోవ్ నుదురు పద్దుకుంటూ "నాతో పోరాడండి. నా కర్థం కావటంలేదు. అవును. నేను భాగ్యవంతుడనే. కాని, నేను ఆ భాగ్యంవల్ల పొందిన దేమిటి? నేనేమి జయించ గల్గాను? మీ అందరికన్నా ఏమయినా సంతోషంగా బ్రతక గలుగుతున్నానా? నా చిన్నతనం అంతా నికృష్టమైన బాని సత్వములో గడిచింది. డబ్బు నా బాధలను, నేనుతిన్న దెబ్బ లను, దూషణలను, ఆనాడు ఆపగలిందా? డబ్బు "నైనను" జబ్బులోను, చనిపోయేప్పుడు కూడా ఆపలేకపోయింది. లక్షలు, లక్షలు ఖర్చు పెట్టినాగాని, నన్ను ఎవరూ ప్రేమించక పోతే ప్రేమించమని ఎవరినీ ఒత్తిడి చేయలేను" అన్నాడు.

"కాని నీవు చాలా మంచి చేయవచ్చు, నీవు చేయా లనుకుంటే" అన్నాడు కిష్.

"నాన్ సెన్స్. నిన్న నీవు లెక్కల పంతులుగా ఒకరికి ఉద్యోగం చూపించమని అడిగావు. నిజానికి నీవు అతనికి ఎంత సహాయం చేయగల్గుతావో నేనూ అంతే. కావాలంటే నేను డబ్బు ఇవ్వగలను. కాని అతనికి కావల్సింది అదికాదు. ఒక సారి నేనొక సంగీత విద్వాంసుని దగ్గరకు వెళ్ళి పేదరికంతో అష్టకష్టాలు పడుతున్న ఒక ఫిడేలు వాయిద్యునకు ఏదో పని చూపించమని అడిగాను. నీవుగనుక సంగీత విద్వాంసుడవైన ట్లయితే నీవు నన్ను ఇలా అడిగివుండేవాడివిగా దన్నారు. అలాగే నేనుకూడా నీకు చెప్పగలను. నీవు గనుక భాగ్యవంతుని బిడ్డవయితే, నీవు ఎన్నటికి వచ్చి నన్ను అడిగివుండేవాడివిగావు. ఎట్టి సహాయానికైనా" అన్నాడు.

"నాకు ఈ పోలిక అర్థంకాలేదు. దీనికి సంగీత విద్వాంసునికి సంబంధం ఏమిటి" అన్నది యూలియా సిగ్గుపడుతూ.

ఆమె ముఖం ద్వేషంతో నిండియుంది. అది కన్పించకుండా వుండటానికి, కళ్ళు దించుకొని, కూచ్చున్నది. కాని ఆమె భర్తగాని ఇతరులుగాని ఆ విషయం గుర్తించక పోలేదు.

"దానికి ఆ ప్రఖ్యాతిగాంచిన సంగీత విద్వాంసునకు సంబంధం ఏమిటి? ఈ ప్రపంచములో పేదవాళ్ళకు సహాయం చేయటం చాలా తేలికయిన విషయం" అన్నది నెమ్మదిగా.

అంతా నిశబ్దంగా వున్నారు. లిస్టోవు అప్పుడే తానన్నది మర్చిపోయాడు. దానివల్ల నష్టంకూడా లేదు. అవి అతని మాటలు కావు. యూలియ అంటే, వుండే ద్వేషంకొలదీ అతన్ని అలా అనాలని అన్నాడు.

భోజనాల తర్వాత లిప్టోవు చదువుకునే గదిలోనికి వెళ్ళి, ప్రక్కగదిలో మాటలు వింటూ కూర్చున్నాడు. వాళ్ళు మరల వాదన సాగించారు. యార్ట్సిస్వి లేచి పియానోమీద పాటలు వాయించటం మొదలుపెట్టాడు. అతనికి అన్నిటి లోనూ ప్రవేశం వున్నది. ఆడతాడు, పాడతాడు; కొన్ని మంత్రాలతో గమ్మత్తులుకూడా చేస్తాడు,

"మీ ఉద్దేశము ఏమిటోగాని, నాకు ఇప్పుడు ఇక్కట ఇంట్లో వుండాలని లేదు. ఎక్కడికో చోటకు వెళదాము పదండి" అన్నది యూలియ.

వాళ్ళు ఊరి బయటవరకూ వెళ్ళిరావటానికి గుఱ్ఱపుబగ్గీ కొఱకు కిషను పంపించారు. వాళ్ళు లిప్టోవును రమ్మని అడగ లేదు. అసలు సాధారణంగా అతనికి అలా వెళ్ళటం ఇష్టముం డదుకూడా. అదీగాదు; ఫాయిడర్ కూడా వుండుటవల్ల వాళ్ళు రమ్మని వుండరు. కాని, లిప్టోవు దీనిని ఇంకొకరకంగా తీసుకొన్నాడు. అతని ఆలోచనలు పరిపరి విధాలుగా పోసాగాయి. సరదాగా అందరితో కలిసితిరగలేని మొద్దుగా, యువకులలో పనికిరాని వ్యక్తిగా, భార్యతో సంతోషంగా, సరదాగా ఆడుతూ పాడుతూ వుండలేని దద్దమ్మగా, డబ్బుగల్గి అనుభవించలేని పిసినిగొట్టుగా – జమకట్టి వుంటారని అను కున్నాడు. వీటన్నిటికంటె అతని భార్య పరాయిమగవాడితో కులుకుతూ వుండి, అతనిని మోసం చేయటంగాని, ఆ రాత్రికి ఆ రాత్రే అతనిభార్య అతని ప్రియమైన స్నేహితునితో లేచి పోయి, తర్వాత వచ్చి కన్నీళ్ళతో, పశ్చాత్తాపంతో తనని క్షమించమని అడగటం మంచిదిగాను తలంచాడు. అసూ

యతో అందరినీ అసహ్యించుకున్నాడు. ఆమె ఎవ్వరితోనో పరాయిమగవాడితో కలిసివుండగా చూచి, తాను విషంత్రాగి ఈ జీవితాన్ని అంతం చేసుకోవాలని, ఈ వ్యధనుండి బయటపడాలని కోరుకొంటున్నాడు.

ఫాయిడర్ టీ త్రాగుతూ, కొంతసేపు కూర్చున్న తర్వాత లేచి "ముసలాయనకు కళ్ళచూపు తగ్గిపోతూంది. సాంతం కనిపించకుండా పోతుందేమో" అంటూ వెళ్ళటానికి బయలుదేరాడు.

లిస్టోవు కూడా అన్నను కొంచెం దూరం సాగనంపి, తాను కూడా "నైట్ క్లబ్బు"కు బయలుదేరాడు.

"ఇదేగావును, వైవాహిక జీవితంలోవున్న అనురాగపు టానందాలు" అంటూ తనలో తననే అసహ్యించుకొంటూ "ఆహా, ప్రేమ, ప్రేమ" అనుకొన్నాడు.

అసూయతో, ద్వేషంతో, అతను గొణుగుతూనే వున్నాడు. ఒక క్లబ్బు లోపలకువచ్చి అటూ ఇటూ తిరుగుతూ, పాటలు వింటూ వున్నాడు. ఇప్పుడు గనుక అతని భార్యను, ఆమె స్నేహితులను చూడడం జరిగితే, అతనేమి మాట్లాడాలని ప్రశ్నించుకొని వుంటాడు. వాళ్ళు కనిపిస్తే చిరునవ్వు నవ్వటమేనని అతనికి తెలుసు. అతనప్పుడు అక్కడకు ఎందుకు వచ్చివుంటాడో వాళ్ళు ఊహించగలరు. ఆ లైట్ల కాంతివల్ల, సంగీతంవల్ల ఫేస్‌పౌడరు వాసనవల్ల, ఆడవాళ్ళు అతనిని చూస్తూ వుండేతీరువల్ల, అతనికి మూర్ఛపోయినంత పని జరిగింది. మరల ఇంకొక చోటుకు వెళ్ళాడు. అక్కడా అతని భార్యా వాళ్ళు కన్పించలేదు. కానీ వస్తూ వుండగా

త్రోవలో "గుఱ్ఱపుబగ్గీ" పెద్ద శబ్దం చేసుకుంటూ అతనిని దాటిపోయింది. త్రాగిన డ్రైవరుయొక్క గల్లంతు, "హా, హా" అనే యార్టిస్టు యొక్క పెద్ద అరుపులు విన్నాడు. అతను తెల్లవారుఝామున 4 గం॥కు ఇంటికి జేరాడు. అప్పటికే యూలియ తిరిగివచ్చి పండుకొనివుంది. ఆమె నిద్ర పోవడం లేదని తెల్సుకొని ఆమెవద్దకువెళ్ళి గట్టిగా "నీకు నేనంటే వుండే అసహ్యాం, హేయభావం నాకు తెల్సు గాని కనీసం ఇతరుల ముందైనా నీవు నన్ను అలా ద్వేషించకుండా వుండవలసింది" అన్నాడు.

ఆమె లేచి కాళ్ళు ముడుచుకొని కూర్చున్నది. నల్లని కళ్ళు దీపపు కాంతిలో పెద్దవిగా కన్పించుచున్నవి.

"క్షమించండి" అన్నదామె.

అతను నిశ్శబ్దంగా మూగవానిలా ఏదో బాధపడుతూ నిలబడి వున్నాడు. ఆమె కూడా వణుకుతూ తప్పుచేసిన దానిలా అతనిముందు కూర్చుని వున్నది.

"ఈ బాధను నేను భరించలేను," తన తల పట్టుకొని "నాకుపిచ్చి ఎత్తేటట్లు వుంది."

"నీ ఉద్దేశములో నేను సంతోషంగా వున్నాననా? నా బాధ ఆ దేవునికే తెలియాలి" అంది.

"మనకు వివాహమై అర్ధసంవత్సరమైంది. కాని నేనంటే నీకు ఏమాత్రము ప్రేమలేదు. నీవు నన్నెందుకు వివాహమాడావు. ఏ మోహము నిన్నిలా పురిగొల్పింది? నీవు ఆశించిందేమిటి? నీ కేమి కావాలి?"

ఆమె అతనివంక అతడు చంపుతాడేమో నన్నంత భయంగా చూస్తూ కూర్చొన్నది.

"నేను నీకు కావాలా? నీవు నన్ను ప్రేమించావా?" అతడు గట్టిగా గాలిపీలుస్తూ "లేదు. మరెందుకు? ఎందుకు చెప్పు? డబ్బువల్లా? వెధవడబ్బు వల్లేనా?"

"దేవునిమీద ఒట్టువేసి చెబుతున్నా. డబ్బువల్లగాదు" అంటూ అవమానింపబడినట్లు, ఏడ్వటం మొదలుపెట్టింది. ఆమె ఏడ్వటం చూడటం అదే మొదటిసారి. "నేను నీ డబ్బునుగూర్చి ఆశించలేదు. అలాంటి ప్రలోభం, దురుద్దేశం, స్వార్థం నాకు లేదు. నేను నీ కోరికను కాదంటే తప్పుచేసిన దాన నవుతానని తలంచాను. మన ఇద్దరి జీవితాలు అలా చేసినట్లయితే నాశనమౌతా యనుకున్నాను, ఇప్పుడు దాని ఫలితం అనుభవిస్తున్నా. నేను సహించలేను. ఈ బాధలు."

ఆమె ఏడుస్తూవుంది. ఆమె ఎంత బాధపడుతూవుందో అతను తెల్సుకొన్నాడు. ఏమి చెప్పాలో, ఎలా ఓదార్చాలో తెలియక తికమకపడుతూ ఆమెముందు కూర్చోబడ్డాడు.

"ఏడ్వకు, ఏడ్వకు యూలియా! నేను నిన్ను అవమానించాను. అనవసరంగా మాటలన్నాను. నేను నిన్ను ఎంతో ప్రేమిస్తున్నాను" అంటూ అకస్మాత్తుగా ఆవేశంతో ఆమె కాలును ముద్దెట్టుకొని, ఉద్రేకంతో ఆమెను కౌగిలించుకొని "నన్ను కొద్దిగా ప్రేమించమనే నేను నిన్ను కోరేది. నీనుండి అదే ఆశించేది, అర్థించేది. ఈరాత్రి...నాతో...గడపవూ... తప్పుచేశా ననుకొనకు యూలియా!"

ఆమె ఇంకా ఏడుస్తూనే వుంది. తన ముద్దులు ఆమె నేరానికి, తప్పిదానికి శిక్షగా తీసుకొని వుంటుందనుకొన్నాడు. అతను ముద్దెట్టుకొన్న పాదం లాగుకొని, ముడుచుకొని కూర్చున్నది. ఆమె అంటే అతనికి ఎంతో ఆప్యాయత, ప్రేమ, జాలి కల్గాయి.

ఆమె పండుకొని దుప్పటి తలవరకు కప్పుకొన్నది. అతను బట్టలు మార్చుకొనివచ్చి ఆమె ప్రక్కన పరున్నాడు. తెల్లవారి ఒకరినిచూచి ఒకరు సిగ్గుపడ్డారు. ఎలా సంభాషణ మొదలుపెట్టాలో ఇద్దరికీ తెలియలేదు. అతను ముద్దెట్టుకొన్న పాదం కాలం యూలియ పట్టివేస్తున్నట్లుగా లిప్టోవు తలంచాడు.

భోజనంముందు ఫనర్వ్ వెళ్ళుతున్నానని చెప్పటానికి వచ్చాడు. యూలియకు కూడా తనఊరు చూడాలనిపించింది. రాత్రి జరిగిన దానికి తప్పిదం చేసినట్లుగా, ఇలా బాధపడుతూ వుండేకన్నా కొంతకాలం వెళ్ళిరావడము మంచిదిగా తలంచింది. భోజనాలవద్ద యూలియ తండ్రిగారివద్దకు వెళ్ళి రెండు మూడు వారాలుండి రావటానికి ప్రయాణము నిశ్చయమైంది.

# 11

యూలియ, ఘనర్వో తప్ప ఆ పెట్టెలో ఎవరూ లేరు.

"నాకు పీటర్సుబర్గు అంటే అంత యిష్టం లే" దంటూ ఘనర్వో చెప్పుకుపోసాగాడు. "చాలామంది ఉద్యోగమిస్తామని మాట యిచ్చారు, కాని ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. నేను ఎన్నో ఉద్యోగాలుచేసి నా శక్తివంచనలేకుండా దేశానికి సేవ చేసినందుకయినా, నాకు వాళ్ళేదో ఒక అవకాశము కల్గించియుండవలసింది. అలాకాక వాళ్ళు నన్నింకొక చోటుకి బదలీ చేశారు." కళ్ళు మూసుకుని తల ఊపుతూ "నన్ను మెచ్చుకొనటము జరగటంలేదు. నేనేమీ పెద్ద తెలివిగల వాడిని గాకపోవచ్చు. కాని నిష్కల్మషంగా, కష్టించి, స్వంత పనిలా, ఉద్యోగధర్మాన్ని నిర్వర్తిస్తూ వుంటాను. అలా, నా లాగ వుండటం ఈ రోజులలో చాలాకష్టం. అసలు నాలాంటి వారుకూడా చాలా అరుదు. స్త్రీలంటె పెద్ద నమ్మకం. అభిమానం నాకు అంతగా వుండదని, నేను వప్పుకొంటా. కాని రష్యను ప్రజలన్నా, ప్రభుత్వమన్నా నా కెప్పుడూ గౌరవం, అభిమానం, భక్తే వున్నాయి" అంటూ కళ్ళు తెరిచి "ఇక నీ సంగతేమిటో కొద్దిగా చెప్పాదూ! ఇంత అకస్మాత్తుగా తండ్రి గారివద్దకు పరుగెత్తుకొని వెళ్ళటానికి కారణ మేమిటి?" అని అడిగాడు.

"ఏదో నా భర్త, నేను, ఒకరినొకరం కొంచెంగా అపార్థం చేసుకొనటం జరిగిందంతే."

"అతను చాలా గమ్మత్తయిన వ్యక్తి. అసలు మాట కొస్తే వాళ్ళంతా అంతే. ఇంకా నీ భర్త మెరుగు. నీ బావ గారున్నారు చూశావూ – వరి చాదస్తుడు, మూర్ఖుడు."

ఘనర్కోవ ఒక నిట్టూర్పు విడిచి "నీకు ప్రియుడెవరయినా వున్నారా ?" అని అడిగాడు.

యూలియ ఆశ్చర్యంగా అతనివంక చూస్తూ నవ్వుతూ, "భలే మంచి ప్రశ్న వేశారు'' అన్నది.

ఆ రాత్రి ఒక స్టేషనులోదిగి, భోజనంచేసి వచ్చిన తర్వాత, ఘనర్కోవ తనకోటు, టోపీ తీసివేసి, వచ్చి యూలియ ప్రక్కన కూర్చుని "నీవు చాలా అందంగా వుంటావుసుమా. నిన్ను నేను పొగుడుతున్నాననుకోనకు, నీవు నిజంగానే చక్కని స్త్రీవి. మనము గనుక 5 సం।లకు పూర్వం యిలా ప్రయాణం గనక చేయటం జరిగినట్లయితే" అంటూ నిట్టూర్చి "నేను నీ ప్రేమ కొఱకు పరితపించి వుండేవాళ్ళలో ఒకడినై వుండే వాడిని. ఇంక ఇప్పుడేముంది? నా పనయిపోయింది. ఎందుకు పనికిరాని ముసలివాడినైనాను'' అన్నాడు.

అతను జాలిగా, అందంగానవ్వి, తన చేయి ఆమె నడుముచుట్టూ పోనిచ్చాడు.

"నీకు మతిపోయిందా ? నన్ను వదలిపెట్టు'' అనిఅన్నది యూలియ సిగ్గుతో, భయంతో.

"నీకు భయంగావుందా ? నీవు యిలాంటిదానికి అలవాటు పడివుండవు" అన్నాడు ఎంతో ప్రేమతో, మృదువుగా.

అతను అలా ముందుకు వెళ్ళినప్పుడు, ఏ స్త్రీఅయినా కొద్దిగా కాదనటం జరిగితే, అతనికి తప్పక భయం కలుగుతుం

దని అతని నమ్మకం. గట్టిగా ఆమె నడుంపట్టుకొని, దగ్గరకు తీసుకొని బుగ్గలు, పెదిమలు అతనెంతో ఆనందాన్నీ ఆమె కిస్తున్నట్టు ముద్దెట్టుకున్నాడు. యూలియ కూడా భయపడటం పోయి నవ్వటం మొదలుపెట్టింది.

"అన్నీ ఉడికిపోయి ఎందుకూ పనికిరాని వ్యక్తి, ఇంత కన్నా నీకేమి ఇవ్వాలే" నంటూ మరొకసారి యూలియాను ముద్దెట్టుకొని "పూర్వం టర్కీలో ముసలి పాషా ఒకడు ఉండేవాడట. అతని సంస్థానంలో అతని ఆధిపత్యంక్రింద అనేక మంది అందమైన యువతులు వుండేవారట. వాళ్ళు అతనికి బహుమానంగా వచ్చారో, వంశపారంపర్యంగా వచ్చే ఆస్తిలా వచ్చారో నాకుమట్టుకు తెలియదు. ఆ అందమైన యువతులు బారులుతీర్చి నిలబడివుండగా, వరుసగా ఒక్కొక్కరిని ఒక్కొక్కసారి ముద్దెట్టుకొని వెళుతూ "అంతే ప్రస్తుతం నేనివ్వగల్గింది; అదే నేను మీకు తెలుప దల్చుకొన్నది" అంటూ వుండేవాడట.

అది అంతా యూలియకు విచిత్రంగాను, కట్టుకథగాను తోచింది. కాని, వినటానికామెకు సరదాగానే వుంది. అతనిని ఏడ్పించాలనుకొన్నది. తన పెట్టెనుండి చాక్లెట్టులు తీసి, పట్టుకొనమని ఒక్కొక్కటి విసరటం మొదలుపెట్టింది.

ఆమె విసిరిన ప్రతిదీ పట్టుకొనటం, నోట్లో వేసుకొనటం "మరొకటి యివ్వవూ?" అన్నట్లుగా ఆమెనంక చూడటం చేస్తున్నాడు. అతని ముఖంలోను, నడవడిలోను ఏదో విడ మర్చి చెప్పనలవిగాని స్త్రీలనాకర్షించే శక్తి, చిన్నపిల్లవానిలో ఆకర్షింపబడే యుక్తి వున్నాయనిపించింది. ఆమె అలా అతని

వంక చూస్తూ కూర్చునివుండగా, అతను దగ్గరకు వెళ్ళి "ఏమి కేం కొంటిపిల్లా" అన్నాడు ఆప్యాయంగా, బుగ్గమీద చిటిక వేస్తూ.

"నీవే తీసుకో, నా కక్కరలేదు" అంటూ చాక్లెట్ల పెట్టె అతని కిచ్చివేసింది.

అవి అన్నీ తిని భద్రంగా పెట్టె దాచుకొన్నాడు. బొమ్మ లున్న పెట్టెలు పోగుచేయటం అతనికి సరదా; అలవాటుకూడా.

"ఇక సరసం మాను. ముసలివాడు నిద్రపోయే సమయం" అన్నాడు.

పడుకొన్న పదినిముషాలకే గురకపెట్టటం సాగించాడు. యూలియకూడ సిగ్గుపడకుండా పండుకొని నిద్రపోయింది.

మరునాడు స్టేషనునుండి ఇంటికి వెళ్ళుతూవుండగా, ఆమెకు తను పుట్టిపెరిగిన ఆ టవును బజార్లు నిర్మానుష్యం గాను, యిళ్ళు చిన్నవిగాను, గుడిసెలుగాను కన్పించాయి. శవం ఎదురువచ్చింది. అది చాలా శుభంగా తలంచింది యూలియ.

పైన వున్న యిల్లు "అద్దెకు ఇవ్వబడు"నని బోర్డు కట్టి వుంది.

ఇంటికి వెళ్ళగానే, క్రొత్త పనిమనిషి తలుపుతీసింది. దుమ్ముతో అసహ్యంగా వున్న మెట్లు ఎక్కుతూవుండగా, యూలియకు మొట్టమొదటిసారిగా లిఫ్టోవు వివాహప్రశక్తి తేవటం గుర్తుకువచ్చింది. డాక్టరుగారి రోగులు డాక్టరుగారి కొరకు ఎదురుచూస్తూ వున్నారు.

డాక్టరుగారు కొంచెం లావెక్కారు. అతని ముఖం ఎర్రగా వుంది. తలకూడా దువ్వుకొనకుండానే టీ తాగు

తున్నాడు. కూతురిని చూడగానే పట్టలేని సంతోషానందాల వల్ల కళ్ళలో నీరుతిరిగాయి. అతనికి సర్వస్వం ఆమె ఒక్కటే. యూలియ ఆవేశంతో తండ్రిని కౌగలించుకొని, తాను కొంత కాలంపాటు తండ్రితో వుండి వెళ్ళటానికి వచ్చానని చెప్పింది. బట్టలు మార్చుకొని యూలియకూడ భోజనాల గదిలోనికి వచ్చింది. డాక్టరుగారు జేబులో చేతులుపెట్టుకొని "రురూ, రురూ" అంటూ ఏదో అయిష్టతతో వున్నట్లుగా, గదిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

"మాస్కోలో నీకు కాలం చాలా సరదాగా గడుస్తూ వుండివుండాలి. నీవు సుఖంగా వున్నావనుకొన్నప్పుడల్లా నాకెంతో సంతోషంగా వుంటుంది. నా విషయం అంటావు - నాలాంటి ముసలిపీనుగకు కావల్సిందేముంటుంది? ఎప్పుడో ఒకనాడు చస్తాను. అప్పుడందరి శని తీరిపోతుంది. అందరి పని హాయిగా వుంటుంది. ఆశ్చర్యమేమంటే నాది చాలా ఆరోగ్యకరమైన శరీరతత్వం. యిలా, యింకా చాలాకాలం జీవించాలిగావును. ఆశ్చర్యం" అన్నాడు.

తాను గాడిదలా పనిచేసే ముసలివాడినని, అందరూ తనమెడపై ఎక్కి స్వారీ చేస్తూ వుంటారని, నైన చనిపోయినప్పుడు, ఖర్మకాండకు చాల ఖర్చు పెట్టానని ఫనర్యా ఏమీ చేయనిరాకరించాడని, యింకా తనవద్ద అప్పుగా 100 రూబుళ్ళు తీసుకొని యివ్వలేదని చెప్పాడు.

"నన్ను తీసుకెళ్ళి మాస్కోలోనే పిచ్చి ఆస్పత్రిలోనో ఎందుకు చేర్చవూ? నేను పిచ్చివాడిని, కాని నాకు న్యాయంలోను, ధర్మంలోను, యిప్పటికీ నమ్మకం వుంది" అన్నాడు.

లిప్టోవు దూరదృష్టిలేనివాడని, యిల్లు చవుకగా పోతూ వుంటే కొనలేదనికూడ నిష్టూరాలు వేశాడు. యూలియ తనేముసలివానికి సర్వస్వం అనుకోనటం తప్పుగా భావించ మొదలుపెట్టింది. డాక్టరుగారు రోగులను చూడడానికి వెళ్లాడు. యూలియ, ఏమీతోచక యింట్లో గదులన్నీ తిరగటం మొదలుపెట్టింది. ఆమెకు టవునంతా ఏమిటో క్రొత్తగావుంది. బయటకు వెళ్లి ఎవరినీ కల్సుకోనాలనిలేదు. తన చిన్ననాటి స్నేహితులు, వివాహంముందు ఆనందపు గడియలు గుర్తుకు వచ్చినా, ఆమె ఏమీ విచారపడలేదు.

యూలియ తనకున్నవాటిల్లోకల్లా ఖరీదైన దుస్తులతో చర్చికి వెళ్ళింది. కాని ఎవ్వరూ ఆ బట్టలనుగాని, యూలియనుగాని గుర్తించినట్లులేదు. ఆమెకు చర్చిలో చాలమార్పు కన్పించింది. అచ్చటకు వచ్చింది పల్లెటూరి జనం. ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా బయటపడా లనుకొన్నది. బయట బిచ్చగాళ్ళు డబ్బు అడుగుతారేమోనని భయపడింది. ప్రతి ఒక్కరివద్ద నిలబడి చిల్లరడబ్బులకొరకు వెతుక్కొనటం అసహ్యంగా, రోతగా తలంచింది. అదీగాక యీనాడు చెక్కులుతప్ప చిల్లర ఆమెవద్ద వుండటంలేదు.

ఆమె కారాత్రి చాలసేపటివరకు నిద్ర పట్టలేదు. నిద్రపట్టిన కొద్దిసేపటికే ఉదయంచూసిన శవం కలలోకి రావటంవల్ల ఆ పీడకలలతో భయపడి నిద్ర మేల్కొన్నది. తలుపువద్ద చప్పుడు వినిపించింది.

డాక్టరు దగ్గుతూవుండటం, పనిమషి కిందకువెళ్ళి పైకివచ్చి తన తలుపుకొట్టడం విన్నది.

"అమ్మగారూ, అమ్మగారూ !"

"ఏమిటె ?"

"మీకు టెలిగ్రాము వచ్చిందమ్మా."

యూలియ టెలిగ్రాము చింపి "నీ ఆరోగ్యముకొరకు తాగుచున్నాము. "యార్టిస్కి" "కిష్" అని చదివింది.

"వట్టి మూర్ఖులు" అన్నది బిగ్గరగా నవ్వుతూ.

గదిలోనికివచ్చి ముఖం కడుక్కొని మిగిలిన రాత్రంతా సర్దుకొని, మధ్యాహ్నం మాస్కోకి బయలుదేరింది.

# 12

దాదాపు సంవత్సరం పైగా గడిచిపోయింది. ఒకనాడు 'యార్టిస్కి' 'యూలియ' తోటలో కూర్చుని యున్నారు. వాళ్ళకు కొద్దిదూరంలో పచ్చగడ్డిపై 'కోస్టియా' తలక్రింద చేతులు పెట్టుకొని ఆకాశంవంక చూస్తూ పడుకొన్నాడు.

"తల్లులు ఎప్పుడూ వాళ్ళ బిడ్డల గొప్పతనాన్ని గూర్చి ఆలోచించుతుంటారు. వాళ్ళు చాలా మంచివారు, బుద్ధిమంతులూ అని అనుకొంటుంటారు. అది చాలా సహజమనుకొంటా" నంటూ యూలియ చెప్పుకుపోతూంది. "తల్లులు చిన్నపిల్ల ఊయలప్రక్క, పిల్ల కళ్ళవంక, చెవుల వంక, ముక్కులవంక చూస్తూ, వారి చిరునవ్వును అమాయకత్వాన్ని ఆనందిస్తూ గంటలు గంటలు నిలబడియుండ గలరు. ఇతరులందరికి తన పాప ముద్దు వస్తుందని, ప్రతివారు

మురిపెంతో ముద్దుపెట్టుకుంటారని అనుకొంటూను. పాప మా పిచ్చితల్లి. నిజంగా అది తల్లుల లోటని నాకు తెల్సు. కాని నేనూ అలాగే చేస్తూయుంటా. నా చిన్నారి చిట్టి "ఓల్గా" చాలా మంచిది. అందమైనది, చాలా తెలివిగలది కూడాను. పాలు ఎలా త్రాగుతూయుంటుందో, ఎలా నవ్వుతూవుంటుందో...ఓల్గా వయస్సు 8 నెలలేగాని, మూడు సంవత్సరాల పిల్లలలో కూడ అలాంటి తెలివితేటలు నేను చూడలేదు."

"నీవు యిలా చెబుతున్నావు సరేగాని, నీవు ఎవరిని ఎక్కువగా ప్రేమిస్తున్నావు? నీ భర్తనా, పాపనా?" అని యార్ట్సిస్వి అడిగాడు.

యూలియ కొద్దిసేపు ఏమి మాట్లాడకుండా వూరు కొని "నాకు తెలియదు. నే నెప్పుడూ నా భర్తను అంతగా ప్రేమించలేదు. నేను మొదటిసారిగా నా జీవితములో ప్రేమించిందే ఓల్గాను. మా వివాహమప్పుడుకూడా నాకు అలెక్సీ అంటే ప్రేమ ఏమాత్రము లేదు. అది చాలా తెలివి తక్కువతనం. ఆ రోజులలో ఎంతగానో బాధపడ్డాను. నా జీవితం, అతని జీవితం కూడా నాశనమయినట్లు తలంచుతూ వుండేదానను. ప్రేమించడం అనేది అంత ముఖ్యంగాని, జీవిత ములో అంత అత్యవసరమైనదికాదని ఇప్పుడు తెల్సుకొన్నా. ప్రేమే వైవాహికజీవితానికి సర్వస్వం అనుకొనటం చాలా తెలివితక్కువతనం" అని జవాబిచ్చింది.

"మరి ప్రేమ గాకపోతే మీ యిద్దరిని బంధించిం దేమిటి? నీవు అతనితో ఎందుకు సంసారం చేయాలి?"

"నాకు తెలియదు...బహుశ...'అలవాటు'. అతనిని గౌరవిస్తా. అతను గనుక కొంతకాలం ఎచ్చటికయినా వెళ్లితే, వంటరి దానను గా బాధపడతా. దానికి, ప్రేమించటానికి ఏమి సంబంధంలేదు. అతను తెలివిగలవాడు, దయాదాక్షిణ్యాలుగల్గిన నిజాయితీపరుడు. అవి చాలు నన్ను సుఖపెట్టటానికి. అతను చాలా మంచివాడు..."

"అవునవును అలెక్సీ చాలా తెలివిగలవాడు. కరుణార్ధ్ర హృదయుడు." అంటూ అటూ ఇటూ డొల్లిగిలుతూ బద్ధకంగా తల పైకెత్తి "అతని తెలివితేటలు, దయాదాక్షిణ్యాలు, అర్ధంచేసుకోనటం ఏమంత తేలికైన విషయంగాదు. అతని దయ, తెలివితేటలవల్ల లాభం ఏమిటి? నీవు అడిగినంత డబ్బు నీకివ్వవచ్చు అంతే. అంతకన్నా అతనేమీ చేయలేడు. వట్టి పిరికిపంద. అలెక్సీ లాంటివాళ్ళు అవసరమైనప్పుడు, దుష్టులతో గట్టిగా పోరాడవల్సి వచ్చినప్పుడు, ముందుకు రాలేని పిరికివాళ్ళు. అందుకే వాళ్ళు, మంచివాళ్ళు అయినప్పటికీ ఎందుకు ఉపయోగపడనివారు" అన్నాడు కోప్టియా.

"టీ టైము" అంది, యూలియ లేస్తూ.

"ప్రేమించకుండా, ప్రేమించబడకుండా, ప్రేమించలేకుండా, నటనప్రాయంగా జీవితం గడుపుతూవుండటం చాలా తప్పు. ప్రేమనుగూర్చి ఎన్నోపుస్తకాలు చదువుతాము. ఎంతగానో మాట్లాడుతూంటాము, కానది మనలోమట్టుకు లేదు. అదేమంత మంచివిషయంగా" దంటూ యార్ట్సివ్ అన్నాడు యూలియ వెనుక నడుస్తూ.

"అంతా వట్టి అబద్ధం. అదేమీ మానవులను సుఖ పెట్టదు"

వాళ్ళంతా కల్సి టీ త్రాగారు.

కిష్, యార్టిస్కీ, యూలియ, ఎంతో తృప్తిగా ఉన్న దానికన్నా తనకేమీ అక్కర్లేదన్నట్లుగా, వున్నట్లుగా తలంచారు. ఆమెవంక చూస్తూ అందరూ ఎంతో హాయిగా వున్నట్లు ప్రపంచమెంతో ప్రశాంతంగా వున్నట్లు తలంచారు. దేవదారు వృక్షాలెంతో అందగాంవున్నాయి. టీ బాగావుంది, సషా ముద్దొచ్చింది.

తరువాత యార్టిస్కీ పియానోమీద పాటలు పాడటం సాగించాడు. అప్పుడప్పుడు యూలియ లేచివెళ్ళి తన కూతురును, జ్వరంతో లంకణాలుచేస్తున్న లిడను చూసివస్తూవుండేది.

"ప్రేమా...ప్రియాతి ప్రియమైన ఓ నా ప్రియురాలా" అంటూ పాడుతూ, "మీరు ఏమైనాచెప్పండి, మీరు ప్రేమకు వ్యతిరేకంగా చెప్పేదేమీ నా కర్థంకాదు. నేనుగనుక రోజుకు 15 గంటలు పనిచేయకుండావుంటే తప్పక ప్రేమగొడవుల్లో పడతాను."

భోజనం తర్వాత 'వైను "కాగ్నాగ్" అంతా కల్సి త్రాగారు. యూలియాకు వంటరిగా పిల్లలతో, పని మనుష్యులతో కూర్చోవటం యిష్టంలేదు.

"నేను, పొరుగువారు కల్సి, పిల్లలతో ఒక నాటకము వేయదల్చుకున్నాము. అన్ని హంగులూ వున్నాయి. కాని మంచికథే దొరకలేదు. పది, పన్నెండు నాటికలవరకు, అనేక

విషయాలమీద వ్రాసినవి వచ్చాయి. కాని మాకేవీ నచ్చ లేదు. నీకు నాటికలంటే యిష్టం. నీకు, చరిత్రనుగూర్చికూడా బాగా తెలుసు, మాకు చారిత్రాత్మక నాటిక ఒకటి వ్రాసి యివ్వగూడదు యార్టిస్కీ" అని అడిగింది యూలియ.

"ప్రయత్నిస్తా."

అధితులు బాగా త్రాగి రాత్రి పది గంటలకు యిళ్ళకు బయలుదేరారు.

"చాలా చలిగా, చీకటిగా వుంది. మీ రెలా చేరు తారో యింటికి" అన్నది యూలియ సాగనంపటానికి గేటు వరకు వచ్చి.

"అలెక్సీ యెక్కడో పేకాడుతూ వుండాలి. గుడ్ నైట్" అని లోపలికి వెళ్ళిపోయింది.

కాంతివంతమైన గదినుంచి బయటకు రాగానే, యార్టి స్కీకి, కోప్టియాకు ఏమీ కన్పించలేదు.

"నాకు ఏమీ కన్పించటములేదు. చూడు చుక్కలు, పదిహేను కోపెక్కుబిళ్ళలలా ఎలా వున్నాయో" అన్నాడు కోప్టియా ఆకాశంవంక చూస్తూ.

"ఏమిటి ?"

"చాలా చీకటిగా వుంది. నీ వెక్కడున్నావు ?"

"హే, భలే. వాళ్ళు సోషలిస్టులు, పట్టుకొన్నా" అన్నాడు కోప్టియా బిగ్గరగా అరుస్తూ.

త్రాగినప్పుడల్లా కోప్టియా అలాగే గల్లంతు చేస్తూ వుంటాడు. పోలీసువాళ్ళతో తగాదాలు కొని తెచ్చు కొంటాడు. అరుస్తూ బిగ్గరగా పాటలు పాడుతూవుంటాడు.

తరువాత, తరువాత చీకటిలోకూడా, చూడటానికి అలవాటుపడ్డాడు. రైళ్ళకూతలు, కారుల శబ్దం వినబడుతూనే వుంది. ఆ యిద్దరు స్నేహితులు త్రోవను కనుగొన్నారు. నిషా దిగిపోతూయున్నట్లుంది. ప్రక్కన అడవిలో జారులు, బోయర్లు దెయ్యాలై నివశిస్తున్నారని యార్టిస్కీ కోష్టియాకు చెబుదామనుకొని చెప్పటం మానివేశాడు.

వాళ్ళు పట్టణం బయటకు వచ్చేటప్పటికి తెల్లవారబోతూవుంది. వాళ్ళు తొందర తొందరగా నడిచి, వాళ్ళ ప్రాంతం చేరేటప్పటికి పూర్తిగా తెల్లవారిపోయింది.

"మాస్కోముందు కెళ్ళటానికి ఎంతకాలం పడుతుంది" అన్నాడు యార్టిస్కీ.

"ఏం, ఎందుకలా అనుకుంటున్నావు ?"

"ఏమిటో, నాకు మాస్కో అంటే మహాయిష్టం."

వాళ్ళు యిద్దరూ మాస్కోలోనే పుట్టిపెరిగారు. అందుకనే వాళ్ళు మాస్కోని అలా పొగుడుతూ వుంటారు. వాళ్ళు యితర పట్టణాలను చిన్నచూపు చూస్తారు. మాస్కో గొప్ప పట్టణం. రష్యా గొప్పదేశం అని వాళ్ళ ఉద్దేశం. క్రిమియ, కాకసస్-ప్రపంచములో ఏప్రాంతమైనా వాళ్ళకు "బోరింగు"గా వుంటుంది, అసహ్యంగా కన్పించుతుంది; మాస్కోకన్నా ఆరోగ్యమైన ప్రదేశం ఎచ్చటా లేదని వాళ్ళ అభిప్రాయం.

చివరకు వాళ్ళు స్టేషనుకు చేరి, టాక్సీ నొకదానిని అద్దెకు తీసుకొన్నారు.

యార్టిస్కీ వ్రాయదల్చుకొన్న చారిత్రాత్మక నాటికను గూర్చి ఆలోచిస్తూ వాళ్ళు యిద్దరూ "డమిట్రోవ్కను" చేరారు.

అచ్చట కోప్టియా దిగబడ్డాడు; యార్టిస్కీ "కటస్క-యా" బజా రులో వున్న తన యింటికి బయలుదేరాడు. అతను తన సీటులో కూర్చుని అటూ ఇటూ ఊగుతూ, కూనిపాట్లు పడుతూ అతను వ్రాయబోయే నాటికను గూర్చి ఆలోచిస్తున్నాడు. ఏదో భయంకరమైన శబ్దం విన్నట్లు, ఊరంతా తగలబడి పోతున్నట్లుగా తలంచాడు. భయంకరంగావున్న ముసలివాడు వల్లంతా కాలినప్పటికి, ఒక తెల్ల రష్యను పిల్లను బలవంత ముగా గుఱ్ఱముపై నెక్కించుకొనబోతున్నాడు. అతను అరుస్తు న్నాడు. నిస్సహాయురాలైన ఆ పిల్ల పాపం ఏడుస్తూ వుంది. యార్టిస్కీ కంగారుపడి మేల్కొన్నాడు.

"నా ప్రేమ...ప్రియాతి ప్రియమైన ప్రియురాలా" అని పాడటం సాగించాడు.

టాక్సీకి డబ్బులిచ్చి, అతను ఆ గ్రామం - అడవులు తగులబడుతున్నట్లు, భయంకరమైర శబ్దం - ఏడ్పులు వింటు న్నట్లు, ఆ పిల్లను గుఱ్ఱంపై కట్టి తీసుకొని వెళ్ళుతున్నట్లు కల గంటూనే తన గదిలోనికి నడిచివెళ్ళాడు.

అప్పటికి బాగా తెల్లవారిపోయింది. తగ గది దీపం యింకా వెలుగుతూనే వుంది. పోలీన నల్లని దుస్తులతో, వార్తాపత్రిక చేతిలో పెట్టుకునే కుర్చీలోపడి నిద్రపోతూ వుంది. అలా పియానో మీాద పాడుతూ, చాలాసేపు అతని కొఱకు వేచివుండి ఉంటుంది.

చాలా అలసిపోయివుంటుం దనుకొన్నాడు. యార్టిస్కీ పేపరు నెమ్మదిగా తీసి, దుప్పటి కప్పి లైట్లు ఆర్పి,తన గదిలోనికి వెళ్ళి పండుకొన్నాడు. ఇంకా అతని చెవులలో "నా ప్రేమ...

ప్రియాతి ప్రియమైన ఓ ప్రియురాలా" అనే పాట మ్రోగు తూనే వుంది. నాటికను గూర్చి ఆలోచించుతున్నారు.

రెండురోజుల తర్వాత లిప్టోవు వచ్చి లిడకు, యూలియకు, బేబీకి డెఫతీరియ అని చెప్పి వెళ్ళాడు. తర్వాత అయిదు రోజులకు లిడ, యూలియ కోలుకున్నట్లు, బేబి చని పోయిందని వార్త వచ్చింది యార్టిస్కికి.

# 13

లిప్టోవు ఎక్కువకాలం యిప్పుడు యింట్లో వుండలేక పోతున్నాడు. అతని భార్య పిల్లలకు పాఠాలు చెప్పాలనే నెపంతో ప్రక్క గదులలోనికి వెళ్లి ఏడుస్తూ కూర్చుంటుంది. వాళ్ళు బేబీ సమాధివద్దకు వెళ్ళేటప్పుడు, అనేక యితర సమయాలలో, యూలియను ఓదార్చటానికి లిప్టోవు ఎన్నో చెబుతూంటాడు. షాపుకు వెళ్ళటం తగ్గించాడు. ఆ పని, యీ పని కల్పించుకొని, ఎవరికో ఒకరికి సహాయం చేస్తూ, ఎప్పుడూ యింట్లో వుండక బయటనే కాలం గడుపుతూ వుండేవాడు. అతను విదేశాలకు వెళ్లి వసతిగృహ నిర్మాణాన్ని గూర్చి చదివిరావా లనుకొంటున్నాడు.

వసంతకాలంలో ఒక రోజున, యూలియ మామూలుగానే ఏడ్వటానికి ప్రక్కగదిలోనికి వెళ్ళింది పుస్తకం చేతిలో పట్టుకొని కూర్చుని, బయటకు వెళ్ళి ఆలోచిస్తూ వున్న లిప్టోవుకు ఫియోటదు వచ్చి పోలీస వచ్చిందని చెప్పాడు.

లిప్టోవు చాలా సంతోషముగా అనుకోనకుండా వచ్చిన అతిథిని ఆహ్వానించటానికి ఎదురు వెళ్ళాడు. అతనేమీ ఇప్పు డామెను గూర్చి ఆలోచించటములేదు. ఆమెలో మార్పుకూడా అతని కేమీ కన్పించలేదు. పూర్వం అతను ఆ సాయంకాలం వదలిపెట్టినప్పుడు ఎలా వుందో, ఇప్పుడుకూడా అట్లాగే వున్నట్లుగా కన్పించింది.

"పోలీన, నిన్నుచూసి యుగాలయినట్లున్నది. ఎంత సంతోషంగా వుందో నీ కర్థంగాదు" అన్నాడు లిప్టోవు ఎంతో ప్రేమగా చేతులు ముందుకుచాచి.

పోలీన చేయివిదిలించుకుని, తిన్నగా గదిలోనికి వెళ్ళి కోటు, టోపీ తీయకుండగానే కుర్చీలో కూలబడింది.

"నేనిచ్చట ఎక్కువసేపు వుండదల్చుకోలేదు. నీతో కూర్చుని భాతాఖానీకొట్టటానికి నాకు అంతకన్నా అవకాశము లేదు. నేను మొగవాళ్ళమాటల కెప్పుడూ విలువకట్టను కాబట్టి నారాక నీకు సంతోషము కల్గించినా, విచారము కల్గించినా నా కేమీ బాధలేదు. అసలది నా కనవసరం. కాబట్టి, నే చెప్పేది విను. నా విద్యార్థులు ఐదుగురు, డబ్బులేక జీతం కట్టలేదు. వాళ్ళ తెలివితక్కువ వల్లనైతేనేమి, వాళ్ళకు డబ్బు లేకపోవుట వల్లనైతేనేమి అలా జరిగింది. నేను చాలాచోట్లకు వెళ్లి, చాలామంది నడిగాను; కాని, లాభం లేకపోయింది. ఇక నీవు వెంటనే యూనివర్శిటీకి వెళ్లి డబ్బు కట్టిరావాలి. తెల్సిందా? లేకపోతే, వాళ్ళను స్కూలునుండి పంపివేస్తారు" అని చెప్పింది. పోలీన మొఖమాటం ఏమీ లేకుండా.

"తప్పక అలాగే చేస్తాను పోలీన."

ఇవిగో వాళ్ళ పేర్లు అంటూ పేపరు అందిస్తూ, "నీ సంసార ఆనందాలను తర్వాత ప్రశాంతంగా అనుభవిద్దువు గానిలే; ముందు వెళ్ళి డబ్బుకట్టు" అన్నది కఠినంగా.

తలుపువెనుక ఏదో శబ్దం అయినట్లు వుంది. పౌలీన ముఖం ఎర్రబడింది. వెళ్ళటానికి లేచింది.

"నీ భార్యారత్నంగారు వస్తూవుంది. అబ్బ, ఏమి తల నొప్పి" అన్నది.

తన భార్య యూలియను గూర్చి పౌలీన అలా అగౌరవంగా మాట్లాడుతున్నందుకు లిప్టోవు నొచ్చుకొన్నాడు.

"ఆమె యిచ్చట లేదు. అవతల ఎచ్చటో వుంది. ఆమెనుగూర్చి దయవుంచి అలా మాట్లాడకు పౌలీన. కొద్ది కాలం క్రితమే మా బేబీ చనిపోయింది. ఆమె చాలా విచారంగా వుంది. ఎప్పుడూ ఏడుస్తూనే వుంటుంది" అన్నాడు.

"నీవు తర్వాత నెమ్మదిగా ఓదార్చు" అంటూ కుర్చీలో నుంచి లేచి, చాలా అసహ్యంగా "ఆమె పన్నెండు మందిని కంటుంది, ఏమీ ఫర్వాలేదు. పిల్లలను కనటానికి ఏమీ తెలివి తేటలు అవసరములేదు" అన్నది.

లిప్టోవు, చాలాకాలం క్రితం ఎప్పుడో, ఒకనాడు యిలాంటి మాటలే విన్నాడు. ఆ మంచిరోజులు గుర్తుకు వచ్చాయి. ఆ రోజులు—తను యువకుడుగా వుండగా, విచ్చలవిడిగా, నిశ్చింతగా గడిపిన రోజులు. ఆనాడు భార్యా అంటే ప్రేమా లేదు. పిల్లలన్న మమకారమూ లేదు.

ఇద్దరూకల్సి యూనివర్సిటీకి వెళ్ళారు ...

"నీవు యిప్పుడు ఎచ్చటకు వెళతావు" అని అడిగాడు లిప్టోవు పోలీనాకు అయిదు రసీదులు ఇస్తూ.

"యార్టిస్వి యింటికి."

"నేనూ నీ వెంట వస్తాను."

"అతను చదువుకుంటూ వుంటాడు. నీవు రావటం జరిగితే అతని చదువు కాస్తా చెడిపోతుంది."

"కాదు. నేనేమీ అతని కాలాన్ని వృధా చేయను" అంటూ బ్రతిమాలుతున్నట్లుగా, లిప్టోవుపోలీన వంకచూశాడు.

విచారగ్రస్తురాలై వున్నట్లు, నల్లటోపీ, కురచ మురికి కోటు, పూర్వంకన్నా బారుగా వున్న ముక్కు, రక్త విహీనమైన ముఖంకల్గిన ఆమె ప్రక్కన నడవటం, ఆమె ఆజ్ఞలను పాలించటం, ఆమె గొణుగుడూ, సనుగుడూ వింటూ వుండటం, లిప్టోవు ఒకవిధమైన ఆనందంగా తలంచాడు. ఆమె అందగత్తె కాకపోయినా, ఆమె ధైర్యసాహసాలతో, క్షణం కూడా తీరిక లేక, మురికిగా తలకూడా దువ్వుకోనకుండా, అసహ్యంగా వున్నా ఆమెలో వున్న ఒక రకమైన ఆకర్షణకు ఆశ్చర్యపడ్డాడు.

వాళ్ళు దొడ్డిత్రోవన లోపలకు వెళ్ళటంవల్ల, వంట మనిషి కంగారుగా ఎదురువచ్చాడు. పోలీన లిప్టోవుకు త్రోవ చూపించింది.

యార్టిస్వి యింటివద్ద లేడు. పోలీనతిన్నగా పియానో వద్దకు వెళ్లి తన పాఠాలు ప్రాక్టీసుచేయటం మొదలుపెట్టింది. లిప్టోవు కుర్చీలో కూర్చుని, పుస్తకం చదువుకొంటున్నాడు. అలా రెండు గంటలు ప్రాక్టీసు చేసి, పోలీన పియానోవద్ద నుండి

లేచి, తొందరతొందరగా భోజనంచేసి పాఠాలు చెప్ప టానికి వెళ్లింది. లిప్టోవు పుస్తకం పూర్తిచేశాడు. తర్వాత నిశ్శబ్దంగా, చదవకుండా, విసుగులేకుండా, యింటికి భోజనానికి వెళ్లే సమయంకూడా దాటిపోయినందులకు, సంతోషిస్తూ కూర్చుని వున్నాడు.

యార్టిస్వ్ పాడుకుంటూ లోపలకు వచ్చాడు.

స్నేహితులిద్దరూకల్సి భోజనం చేశారు. తర్వాత, లిప్టోవు సోఫాలో పండుకొన్నాడు. దానిమీద అతని ప్రక్కనే యార్టిస్వ్ కూర్చుని సిగరెట్టు వెలిగించాడు.

"నేను ముసలివాడ నవుతున్నా. మా అక్కనైన చనిపోయిన నాటినుంచి, నేను చావునుగురించి ఆలోచిస్తున్నా" అన్నాడు లిప్టోవు.

వాళ్ళిద్దరూ చావునుగూర్చి, చావులేని ఆత్మనుగూర్చి, హాయిగా ఎగిరి నక్షత్రాలలో పనీపాటా లేకుండా కులాసాగా గడపటంగూర్చి, ఎక్కడ నిశ్చింతగా, స్వేచ్ఛగా, దేవతలలా కాలం గడుపు అవకాశం వుంటుందో మొదలగు విషయాలను గూర్చి మాట్లాడుతున్నారు.

"నాకు మట్టుకు చావాలని లేదు. చావటం మేలని చెప్పే వేదాంతములో నా కేమీ నమ్మకము లేదు. చావుతో అన్నీ అంతమవుతాయి. నేను బ్రతకదల్చుకొన్నా" అన్నాడు యార్టిస్వ్ నెమ్మదిగా.

"నా విషయం, నేనే అర్థం చేసుకొనలేకుండా వున్నా. నిరాశ, నిస్పృహలతో బ్రతికేకంటే చావటం మేలనిపించుతూ వుంది. నేను పిరికివాడిని; నాలో నాకే నమ్మకంలేదు. నా జీవి

తానికి నేనే కర్తననే ధైర్యంతో, బ్రతక నేర్వలేకుండా వున్నా. చాలామంది ఏదో చెత్త మాట్లాడి, కల్లిబొల్లి కబుర్లు చెప్పి, యితరులను మోసగించి ఎంతో ఆనందాన్ని అనుభవిస్తారు. కాని, నేను మంచిచేయటానికికూడా, భయంతో వెనకాడుతూ వుంటాను. వీటన్నిటికీ కారణం, నా బానిసత్వం. నేను బానిసను; ఒక బానిస మనుమడ్ని. నాలాంటి సామాన్యులు, నీచులు వాళ్ళ గమ్యం ఏమిటో తెల్సుకొనకముందే, వాళ్ళ మార్గం వాళ్ళు అన్వేషించకముందే, బానిసవిముక్తికి మార్గం తెలియకముందే యీ లోకంనుండి సెలవు పుచ్చుకుంటారు."

"అదికూడా ఒక విధంగా మంచిదే" అంటూ యార్టిస్వీ నిట్టూర్చి, "అది అంతా రష్యా ఎంత భాగ్యవంతమైనదో, విభిన్న దృక్పథాలు కల్గివున్నదో తెలియజేస్తుంది. నాలో రోజురోజుకు, మనం ఏదో గొప్ప జయం సాధించటానికి సిద్ధంగా వున్నట్లుగా ఉత్సాహం పెరుగుతూ వుంది. నేను అప్పటివరకు బ్రతికి, బాగుండి, దానిలో భాగస్తుని కావాలనే నా ఆశ. రోజురోజుకు పురోభివృద్ధి చెందుతున్న యీ కాలానికి చెందినవాడనైనందుకు, ఎంతో గర్వపడుతున్నా. నేను చిన్న పిల్లలకు, ప్రత్యేకంగా ఆడపిల్లలకు చదువు చెప్పుచున్నప్పుడు, నా హృదయం ఆనందముతో నిండిపోతుంది. ఎంత మంచి పిల్లలు? భావిపౌరులు" అన్నాడు.

మరల కొద్దిసేపటి తర్వాత యార్టిస్వీ "నేను రసాయనిక శాస్త్రజ్ఞుడను. నా ఆలోచనలన్నీకూడా అలాగనే వుంటాయి. నేను రసాయనిక శాస్త్రజ్ఞునిగానే చావదల్చుకొన్నాను. కాని నా కోరికలు నెరవేరకముందే, నా అభిమతం తీరకముందే,

చచ్చిపోతానేమోనని నా భయం. ఒక్క రసాయనిక శాస్త్రమే గాదు నేను నేర్చుకొనవలసినది, రష్యా దేశ చరిత్ర, కళలు, సంగీతం మొదలగు అనేక విషయాలను నేను నేర్చుకోవాలి. పోయిన వేసవికాలంలో నీ భార్య ఒక చరిత్రాత్మక నాటికను వ్రాసి యివ్వమని కోరింది. ఇప్పుడయితే మూడు రాత్రుళ్ళు, మూడు పగళ్ళు కదలకుండా, తదేక నిష్ఠతో కూర్చుని వ్రాసి యివ్వగలను. ఆలోచనలతో నా బుర్ర అంతా నిండిపోయి వుంది. అగ్నిపర్వతంలా ఎప్పుడో ఒక నాడు బ్రద్ధలవుతుందేమోనని నా భయం. అందుబాటులో లేనిదానిని గూర్చి, ఆశపడి, వేచియుండి బాధపడను. నేనేదో బ్రతికి ఘనకార్యం సాధించాలని నా అభిమతంగాదు. నేను కలలుగంటూ, ఆశతో నిరాశ నెరుగకుండా బ్రతకాలనే... జీవితకాలం, చాలా కొద్ది, ఎక్కువభాగం, వీలైనంత తొందరగా, సవ్యంగా, ఆనందంగా, హాయిగా, తృప్తిగా బ్రతకటానికి ఉపయోగించుకోవాలి" అన్నాడు.

ఆ రోజునుండి ప్రతిరోజూ లిప్తోవు, యార్ట్సిస్వి కలుసుకుంటూనే వున్నారు. యార్ట్సిస్వి లిప్తోవుచే ఆకర్షింపబడ్డాడు. ప్రతిరోజూ సాయంకాలంవచ్చి యార్ట్సిస్వికొఱకు, ఎదురు చూస్తూ సోఫాలో పండుకొని యుండేవాడు. భోజనంతర్వాత సాధారణంగా యార్ట్సిస్వి చదువుకుంటూ వుండేవాడు. కాని కొద్దిసేపట్లోనే లిప్తోవు ఏదో ప్రశ్న వేయటం, అదే పెద్ద వాదనకు దారితీయటం జరుగుతూ వుండేది. యార్ట్సిస్వికి యిక చదువు ఖాళీ. అర్థరాత్రి, ఎంతో తృప్తిగా, ఒకరినొకరు మెచ్చుకుంటూ విడిపోతారు.

ఇది ఎంతో కాలం కొనసాగలేదు. ఒకరోజు లిప్టోవు వచ్చేటప్పటికి పాలీనా పియానోవద్ద కూర్చుని యున్నది.

"నీవు యిలా రావటం ఎప్పుడు మానుకొనగలవో, దయవుంచి చెప్పగలవూ ?" అని అడిగింది, మొగమాటంగాని, మంచీ, మర్యాద ఏమీ లేకుండ.

"ఏమిటి ?" అని అడిగాడు, లిప్టోవు సగం చచ్చిపోయి.

"నీవు ప్రతిరోజూ ఇలావచ్చి యార్టిస్విని పాడుచేస్తున్నావు. నీవు వ్యాపారస్తుడవు. అతనొక విజ్ఞానవేత్త. ప్రతి నిముషం అతనికెంతో విలువైంది. అది నీకు తెల్సివుండాలి. మనిషైనతర్వాత ఆ మాత్రం ఇంగితజ్ఞానం వుండాలి."

"నీవు నిజంగా నే నతన్ని పాడుచేస్తున్నా ననుకుంటే రావటం మానుకుంటా."

"మంచిది ఇప్పుడే వెళ్ళు అతనువచ్చే సమయంకూడా"

ఆమె ఆమాటలు చెప్పినతీరు, ఆమె అతనివంకచూచిన చూపు, అతనిని ఎంతో బాధపెట్టాయి. ఆమెకు ఇప్పుడు తనంటే ఏమాత్రం అభిమానంకూడా లేదనుకున్నాడు. పూర్వం అతనంటే ఎంతో అనురాగంగా వుండేది. ఏమీ మారుపలక కుండానే వెనుదిరిగి బయటకువచ్చాడు. వెనుకనుండి ఆమె పిలుస్తుందని ఎంతగానో ఆశించాడు. కానీ అలాంటిదేమీ జరుగలేదు. అతను ఆమెకుచాలా అపరచితుడుగా తలంచాడు

మూడురోజుల తర్వాత యార్టిస్వి, లిప్టోవును చూడటానికి వచ్చాడు.

"నేనొక విషయంచెప్పా" లనుకుంటూ నవ్వుతూ "పాలీనా నాతో వుండిపోవటానికి వచ్చింది." అని కొద్దిగా

కంగారుపడుతూ, "మాలో ఎవ్వరికి, ఒకరంటే ఒకరికి ప్రేమ లేదు. అదేమంత ముఖ్యమైన విషయమేమీ కాదనుకుంటాను. ఆమెకు ఏదో నీడ నివ్వటానికి, ఆమె జబ్బు పడినప్పుడుకూడా, కష్టపడి, బ్రతకవల్సిన అవుసరం లేకుండా, చేయగల్గినందుకు నాకు ఎంతో సంతోషంగావుంది. ఆమెనాతో వుండటం జరిగితే, నా జీవితంకూడా ఒకపద్ధతిగా వుంటుందని, ఆమె సహాయంవల్ల, నేనొక గొప్పవిజ్ఞానవేత్త నవుతానని, ఆమె ఉద్దేశ్యం పాపం. తెలివితక్కువవాళ్ళకు ఆలోచనలు ఎక్కువట హా... హీ" అన్నాడు.

లిప్టోవ్ ఏమీ మాట్లాడలేదు. యార్టిస్వీగదిలో అటూ ఇటూ తిరగటం మొదలుపెట్టాడు గోడనున్న బొమ్మలు చూస్తూ. వాటినదివర కెన్నో సార్లు చూసాడు.

"ప్రియమైన స్నేహితుడా నీకు తెల్సునా, నేను నీకన్నా వయస్సులో 3 సంవత్సరాలు పెద్దవాడిని. ఈ వయస్సులో నిష్కల్మషంగా, ప్రేమించే వ్యక్తికోసం చూడటం హాస్యాస్పదం. పోలీనా వంటిస్త్రీ నా కోసం, నా వద్దకు, దేవుడు పంపాడని చెప్పాలి. ఆమెతో నా జీవితం గడపగలననుకుంటా. కాని నాకు ఏదోలోటు వున్నట్లు, నేనెప్పుడూ దేనికో వెతుకుతూ వుంటా. నేను వంటరిగా కూర్చున్నప్పుడు, మానవుడు ఎప్పుడూ ఎంత వున్నప్పటికి, తృప్తిపడడనుకుంటూవుంటాను" అన్నాడు యార్టిస్వీ అప్పుడప్పుడూ నిట్టూర్పుతో.

తర్వాత ఫియానోవద్దకువెళ్ళి కొన్ని ప్రేమగీతాలు పాడాడు. లిప్టోవ్, నిశబ్ధంగా, కళ్ళుమూసుకుని, కూర్చుని, పోలీనా, యార్టిస్వీవద్దకు ఎందుకు వెళ్ళిందా అని ఆలోచిస్తూ

వున్నాడు. మానవులకు, మానవులకు మధ్య వుండే అనుబంధ, సంబంధ బాంధవ్యాలు తాత్కాలికమైనవి తప్ప మరేమీ లేవనుకొని చాలా విచారపడ్డాడు.

యాక్టిస్వితో వుండ నిశ్చయించుకొన్నందుకు పోలీస మీద, తన భార్యను పూర్వంలా ప్రేమించలేక పోతున్నందుకు తనమీద తనకే కోపం, అసహ్యం కల్గాయి.

# 14

లిప్టోవు కుర్చీలో కూర్చుని ముందుకు, వెనుకకు ఊగుతూ చదువుకొంటున్నాడు. యూలియకూడా ఏదో పుస్తకం చదువుకుంటూ వున్నది. వాళ్ళిద్దరకు ఒకరికొకరకు సంబంధం లేదన్నట్లు, ఒకరితో ఒకరు మాట్లాడు కొననట్లు ప్రొద్దుటినుండి అలాగే మాట్లాడకుండా కూర్చొని వున్నారు. ప్రేమించి పెళ్లిచేసుకొన్నా, ప్రేమించకుండా పెళ్లి చేసుకొన్నా పెద్దభేదంఏమీవుండ"దని పుస్తకంచదువుకొంటున్న యూలియా వంక చూస్తూ అనుకొన్నాడు. పూర్వం అసూయతో, బాధ పడిన రోజులు, తర్వాత విదేశప్రయాణం గుర్తుకు వచ్చాయి. మరల యింకొకసారి విదేశాలకు వెళ్ళాలనుకొన్నాడు.

యూలియ పూర్వంలా ఏడ్వటం యిప్పుడు మాని వేసింది. చలికాలం అవటంవల్ల ఎక్కువగా బయటకు కూడా వెళ్ళకుండా కాలం అంతా ఇంట్లోనే గడుపుతూ వుంది. పెద్ద పెద్ద గదులలో వుండడం ఆమెకు యిప్పుడు ఇష్టంగా వుండటం

లేదు. అందువల్ల ఆమె కాలమంతా తన భర్త చదువు కొనే గదిలోగాని, తన గదిలోగాని గడుపుతూవుంది. ఆమె పూర్వంలా యిప్పుడు తనకొరకు ఏమీ డబ్బుకూడా ఖర్చు పెట్టటములేదు. తను తన తండ్రివద్ద వున్నప్పుడు యెలా వుండేదో ఇప్పుడుకూడా అలాగే వుంటూవుంది.

బయటకు వెళ్ళి చూసి, ఆనందించవల్సినవికూడా క్రొత్తవి ఏమీ లేకపోవటంవల్ల రోజులు గడ్వటం యూలియాకు కష్టంగా వుంది. లిస్టోకు బాధకల్గించే పని ఏదోవొకటి రోజూ దొరుకుతూనే వుంది. ముసలాయనకు పూర్తిగా చూపు తగ్గిపోయింది. షాపుకు వెళ్ళటం మానివేశాడు. కొద్ది కాలంలోనే చూపు పూర్తిగాపోయి, గ్రుడ్డివాడవుతాడని డాక్టర్లు చెప్పారు. ఫాయిడర్ కూడా షాపుకెళ్ళటం తగ్గించి, ఇంట్లో కూర్చుని ఏదో వ్రాస్తూ కాలంవెళ్ళబుచ్చుతున్నాడు." ఫనర్వోకు బదిలీ అయింది. ప్రస్తుతం మాస్కోలోనే వుంటున్నాడు. ప్రతిరోజూ లిస్టోవు వద్దకు అప్పుకొరకు వస్తూవుంటాడు. కిష్ ఎలాగయితే డిగ్రీ సంపాదించాడు. ఉద్యోగం కొరకు లిస్టోవును సతాయించటం సాగించాడు. ప్రతిరోజూ వచ్చి తన కథలతో వాళ్ళను చంపుతున్నాడు. ఇవి అన్నీ లిస్టోవుకు చాలా విసుగెత్తించాయి. జీవితంపై విసుగు, అసహ్యంకల్గాయి.

ఎవరో స్త్రీ లిస్టోవును చూడవచ్చిందని ఫియోటుకు ఆమెపేరుతో వున్నకార్డు ఒకటి యిచ్చాడు. ఆ కార్డుపై జోసఫియూన అని వ్రాసివుంది.

యూలియ లేచి బయటకువెళ్ళింది. నల్లని దుస్తులతో సన్నని స్త్రీ, ఒకామె లోపలకు వచ్చింది.

"లిప్టోవు! నా పిల్లలను రక్షించు" అన్నది గుండెపై బాదుకుంటూ.

ఆ చేతిగాజులు, ఆ ముఖానికి వ్రాసుకున్న పౌడరు లిప్టోవుకు పరిచయమే. తన పెండ్లికిముందు చాలా అసభ్యంగా, ఒకరోజు వాళ్ళింటికి భోజనానికి వెళ్ళాడు. ఆమె ఫనర్వో రెండవభార్య.

"నా పిల్లలను రక్షించు" అంటూ ఏడుస్తూ, "నీవు ఒక్కడివే మమ్మలను రక్షించగల్గేది, నా వద్దవున్న చివరి చిల్లిగవ్వకూడా నీ వద్దకురానటానికి ఖర్చుపెట్టా, నా పిల్లలు ఆకలితో చచ్చిపోతారు" అన్నది.

ఆమె అతనికాళ్ళమీద పడుతుందేమోనని భయంతో, ఆమె చెయ్యి పట్టుకొన్నాడు.

"ఏడ్వకండి, కూర్చొండి" అంటూ కుర్చీవద్దకు తీసుకొని వెళ్ళాడు.

"రొట్టెకుకూడా డబ్బులులేవు. ఫనర్వో తన క్రొత్త ఉద్యోగానికి మమ్మలను వదిలిపెట్టి వెళ్ళుతున్నాడు. మీరు పంపుతూవున్న డబ్బుకూడా అతనే ఖర్చుపెట్టుకుంటూ వుండేవాడు. ఇప్పుడు నేనేమిచేయాలి? ఓ దేవుడా! ఈ చిన్నపిల్లలతో నేనెలా బ్రతకాలి?"

"ఏడ్వకండి. గుమాస్తాకు యికనుండి మీకే డబ్బుపంపమని చెబుతాను."

ఆమె ఏడ్చిఏడ్చి ఊరుకొన్నది. కన్నీటిచారలను పౌడరుతో నిండివున్న ఆమె బుగ్గలపై చూచాడు. ఆమెకు కొంచెం మీసాలుకూడా వున్నాయి.

"మీ సహాయాన్ని నే నెప్పుడూ మరువలేను. ఫనర్కోవకు మమ్మల్ని తనతో కూడా తీసుకువెళ్ళమని చెప్పండి. అతనిని ఎంతగానో ప్రేమిస్తున్నా. అతనిని విడిచి క్షణంకూడా బ్రతకలేను. అతనే నా సర్వస్వం."

లిప్టోవు వంద రూబులులు ఆమె చేతికియిచ్చి, తప్పక ఫనర్కోవకు చెబుతానని ఓదార్చి పంపాడు.

తరువాత కిష్ వచ్చాడు. అటుతర్వాత కోప్టియా తన క్రొత్త కెమేరాతో వచ్చాడు. ఈమధ్య కన్పించిన ప్రతివారి ఫొటోలు తీయటం అతనికొక సరదా అయ్యింది.

టీ త్రాగబోయే సమయముముందు ఫాయిడరు వచ్చి, చదువుకొనే గదిలోనికి వెళ్ళి పుస్తకంచూస్తూ కూర్చున్నాడు. అతనిని, అతని వాలకం చూస్తూవుంటే లిప్టోవుకు చాలా బాధగానూ, కోపంగానూ వుంది.

"ఒక క్రొత్త రచయిత ఉద్భవించినందుకు రష్యాను నీవు అభినందించవచ్చు అలెక్సీ" అంటూ ఫాయిడరు అలెక్సీ, నేనొక వ్యాసం వ్రాశాను. ఇది నా తొలిప్రయత్నం. నీతో చదివించి, నీ ఉద్దేశం ఏమిటో తెల్సుకోడానికి పట్టుకువచ్చాను. నీ అభిప్రాయం నిష్కల్మషంగా చెప్పాలి సుమా!

ఒక నోటుబుక్కు తీసి లిప్టోవుకు యిచ్చాడు. ఆ వ్యాసానికి పేరు "రష్యా ఆత్మ" అని పెట్టాడు.

అది ఏమీ బాగాలేదు. తెలివితక్కువవాడు వ్రాసినట్లుగానే వుంది. తెలివిగలవాళ్ళు, విద్యావంతులు దేవుళ్ళను, దేవతలను నమ్మకపోవచ్చు. అది వాళ్ళ హక్కు. కాని నల్గురిని తెలియనివాళ్ళను, అమాయకులను, గ్రుడ్డిగా నమ్మే

వారిని చెడుమార్గాలను పట్టించగూడదని, అది సహింపరాని విషయమని ఆ వ్యాసముయొక్క భావం.

"యూరపును రక్షించిన దేమిటి?"

"దానిలోనే వుందిగా."

"అదేమి నీ వనుకున్నట్లు లేదు. అసలు ఈ వ్యాసం ఎందుకు వ్రాశావోకూడ అర్థంకాకుండా వుంది. అయినా నా కనవసరం."

"నేను ప్రచురించదల్చుకున్నా."

"అది నీ యిష్టానికి, నీకు సంబంధించిన విషయం."

కొంచెంసేపు యిద్దరూ నెమ్మదిగా వున్నారు.

"నీవు నా వుద్దేశ్యాలను పంచుకోనలేనందుకు చాలా విచారిస్తున్నాను అలెక్సీ.మనిద్దరము రష్యను దేశస్తులం. దేవుడన్న భయభక్తులున్న సుహృదయం. అర్థంలేని జర్మనీ దేశస్థుల, యూదుల వుద్దేశ్యాలు మనకెందుకు? నీవు, నేను ఒకరకపు వ్యక్తులం గాదు. కాని మనిద్దరం ఒక గొప్ప ఉన్నత కుటుంబం లోనివాళ్ళం."

"ఉన్నత కుటుంబం, ఉన్నత వంశం ఏమిటి చెప్పు బాబు, హూఁ మన తాతగారిని జమీందారు తన్నుతూవుండే వాడు. ప్రతి చిన్న ఉద్యోగి, ఎందుకూ పనికిరాని ప్రతివాడూ, ఆయన ముఖాన ఊస్తూవుండేవాడు. తాతగారు మన నాన్న గారిని కొట్టారు. మన నాన్నగారు నిన్నూ, నన్నూ కొట్టారు. నీవు, నేను ఎలాంటి రక్తాన్ని, నరాలను పంచుకున్నాము? మన ఉన్నత కుటుంబం, గొప్ప వంశం ఏవిధంగా మనకు తోడ్ప డ్డాయి, ఎలా సహాయపడ్డాయి చెప్పు? నీవు ఈ మూడు సంవత్స

రాలనుండి, అనేక వికృత ఆకారాలు దాల్చుతూ, నాటకా లాడుతూ అన్నిరకాల చేష్టనూ మాట్లాడుతూ, చివరకు ఈ అమోఘవ్యాసాన్ని వ్రాశావు-బానిస బ్రదుకు. ఇక నేనంటావు? నావంక చూడు. నాలో నిశ్చలతగాని, ధైర్యసాహసాలుగాని, లేనే లేవు. నేను చేయదల్చుకొన్న ప్రతి పనికి, మంచికి, చెడుకి భయపడుతూనే ఉంటాను. ఎవరో నన్ను కొట్టబో తున్నట్లు ప్రతి ఒక్కరిముందు, నా కన్నా అన్ని విధాలా తక్కువవాళ్ళముందు కూడా వణకిపోతూ ఉంటాను. పాకీ వాళ్ళన్నా, గేటు కాపలావాళ్ళన్నా, పోలీసువాళ్ళన్నా, ఎవ రన్నా భయపడుతూనే ఉంటాను. వీటన్నింటికీ కారణ మేమిటి? మన అమ్మకూడా అలా వణుకుతూ, భయంతో కంపించిపోతూ, బ్రతుకుతూనే నన్ను కన్నది. నేను ఎప్పుడూ తన్నులు, తిట్లు తింటూ, ఈడ్వబడుతూ బ్రతికాను. నీకుగాని, నాకుగాని పిల్లలు లేకపోవటమే మంచిది. మనతో ఈ ఉన్నత వ్యాపారస్తుల కుటుంబం, గొప్పవంశం అంతంగావాలని కోరు కొంటున్నా. మనస్ఫూర్తిగా దేవుని ప్రార్థిస్తున్నా" అన్నాడు.

యూలియ ఆ సమయంలో లోపలకువచ్చి కూర్చొంది.

"మీ రిద్దరూ, ఏదో వాదించుకుంటున్నారనుకుంటా. నేను రావటం మీకేమీ అభ్యంతరం లేదుకదూ" అని అడి గింది యూలియ ఇద్దరిని ఉద్దేశించి.

"అలాంటి దేమీలేదు చిట్టి చెల్లెలా. మే మేదో ఉబుసుపోక వాదించుకుంటున్నా" మంటూ ఫాయిడను లిష్టోవ్ వైపు తిరిగి నీవు చివరకు, నిన్ను ఇంతవానిగా చేసిన మన కుటుంబాన్నే ద్వేషిస్తున్నావన్నమాట. లక్షల విలువైన వ్యాపా

రాన్ని నిలబెట్టింది మన కుటుంబం, దానిని కాదంటున్నావా? దానికి విలువ కట్టటం ఎవరికి సాధ్యం" అన్నాడు.

"ఆహా, ఏమి గొప్పతనం, ఏమి గొప్పతనం...లక్షల మీద వ్యాపారం. ఏమాత్రం తెలివితేటలు, ఇంగితజ్ఞానం లేని వ్యక్తి అదృష్టంకొద్దీ ఒక దుకాణదారుడయ్యాడు. తర్వాత అలాగే యంత్రంలా పనిచేసి, సంపాదించాడు. ఏమాత్రం శ్రమగాని, తెలివితేటలుగాని లేకుండానే, అతని జీవితమంతా వ్యాపారం లోనే గడపనిశ్చయిస్తాడు. కారణం గుమస్తాలమీద స్వారీ చేస్తూ పెత్తనం చెలాయించవచ్చు, తోటి వ్యాపారస్థులను ముప్పతిప్పలుపెట్టి ఏడ్పించవచ్చు. చర్చిలోకూడ వాళ్ళందరి ముందు తను గొప్ప అనిపించుకోటానికి, పెత్తనం చెలాయిం చుతూ వుంటాడు. పంతుళ్ళు తన మోచేతినీళ్ళు త్రాగుతూ, అడుగులకు మడుగులొత్తుతూ వుంటారనే ఉద్దేశ్యంతో, స్కూళ్ళను పోషిస్తాడు. ఆ వ్యాపారస్థునికి కావల్సింది, అతను ఆశించేది వ్యాపారంగాదు. పెత్తనం, అధికారం. షాపువుండే అదొక చీకటికొట్టు, వ్యాపారసంస్థ మట్టుకుగాదు. అవును, అలాంటి వ్యాపారానికి కావల్సిందికూడ చిత్తం చిత్తం అంటూ చేతులనలుపుకుంటూ, కుక్కినపేనులాపడివుండే గుమస్తాలు. మీకు మొదటినుండీ రొట్టెముక్కకు మీ కాళ్ళపైబడి, ప్రాధే యపడి బ్రతికేటట్లుగా తయారుచేస్తారు వాళ్ళను; చేశారుకూడా చాలామందిని. మీ రెప్పుడైనా యూనివర్శిటీ డిగ్రీవున్నవానికి ఉద్యోగం యిచ్చారూ? యివ్వరు. ఎందుకిస్తారు? అతను మీకు తొత్తుగా పడివుండడుగా. నిజం గదూ?"

"డిగ్రీలున్నవాళ్ళు మన షాపులో పనిచేయటానికి రారు."

"అది నిజంగాదూ. శుద్ధ అబద్ధం."

"క్షమించాలి, నీ యింటినే నీవు కూలద్రోయ ప్రయత్నిస్తున్నావు. కన్నతల్లి రొమ్ములుగుద్దే వానిలా తయారవుతున్నావు" అంటూ ఫాయిడకు లేచి "నీవు వ్యాపారాన్నయితే అసహ్యించు కొంటున్నావుగాని, దానినుండివచ్చే లాభంతోనే జీవిస్తున్నావు" అని అన్నాడు.

అవు నవును. అదే అసలు విషయం. నేను గనుక ఈ ఉన్నత కుటుంబంలో పుట్టుకపోయి వున్నట్లయితే నాకే గనుక ఆత్మశక్తి, ధైర్యం వున్నట్లయితే నేను ఏనాడో యీ డబ్బును కాలదన్ని, స్వశక్తిమీద ఆధారపడి, కష్టపడి సంపాదించుకొని హాయిగా బ్రతుకుతూ వుండేవాడిని కాని, యీ ఉన్నతకుటుంబం నన్ను దోచుకొంది. అందువల్లే నేను మీతో యిచ్చట పడివున్నా."

ఫాయిడకు గడియారంవంక చూచి, లేచి యూలియ చేయి ముద్దుపెట్టుకొని వెళ్ళడానికి బయలుదేరాడు. హాలులోనికి వెళ్ళడానికి బదులు డ్రాయింగు రూములోనికి వెళ్ళి, అచ్చటనుండి పడకగదిలోనికి వెళ్ళి "నాకు త్రోవ తెలియడంలేదు. ఇల్లు చాల విచిత్రంగా వుంది. విచిత్రంగా లేదూ?" అన్నాడు.

ఫాయిడకు కోటు తొడుక్కొంటూ వుండగా అతని ముఖంలో కోపం, ఆశ్చర్యం లిప్తోవు చూశాడు. పిచ్చి అన్నపై కోపముపోయి, యిన్ని సంవత్సరాలనుండి చచ్చి

పోయిం దనుకొన్న సోదరప్రేమ పైకి ఉబికింది. దగ్గరకు వెళ్ళి ఆప్యాయంగా "రేపు నీవు యిచ్చటకు భోజనానికి రావాలి. తప్పక వస్తావుగదూ ?" అన్నాడు అన్న భుజం తట్టుతూ.

"తప్పక - అలాగే. కాసిని మంచినీళ్ళు కావాలి."

లిప్టోవు వంటగదిలోనికి పరుగెత్తుకెళ్ళి దగ్గరలోవున్న మంచినీళ్ళ కూజా తీసుకొనివచ్చి యిచ్చాడు. ఫాయిడరు దాహంతో వున్నట్లు గడ గడ త్రాగుతూ కూజా మూతిని కొరికిన చప్పుడయింది. తరువాత ఏడ్పు వినిపించింది. అతని బట్టలు తడిశాయి. లిప్టోవు పురుషు లేడ్వడం ఎప్పుడూ చూడ లేదు. భయంతో దిగాలుపడి చూస్తూవుండగా యూలియ, పనిమనిషి కల్సి ఫాయిడరు కోటుతీసి, తీసుకొనివెళ్ళి కుర్చీలో కూర్చొబెట్టారు.

యూలియ ఫాయిడరును పడకకుర్చీలో కూర్చొనబెట్టి ఉపచర్య చేసింది.

"ఏమీ లేదు. నరాల బలహీనతవల్ల" అంది.

"నాకు చాలా బాధగా వుంది. నాకు సుఖం లేదు... నేను...యింతవరకు ఎవ్వరికీ చెప్పకుండా దాచివుంచాను."

అతని చేతిని యూలియ భుజంపై వుంచి, "నాకు ప్రతి రాత్రి నైనసనుగూర్చి కలలువస్తూ వుంటాయి. నైన వచ్చి నా మంచంప్రక్కన కుర్చీలో కూర్చొని వుంటుంది" అని చెప్పాడు నెమ్మదిగా.

ఒక గంట తరువాత నవ్వుతూ లేచాడు. పనిమనిషిని చూసి మన్సులో కొంచెం సిగ్గుపడ్డాడు. లిప్టోవు తీసుకొనివెళ్ళి దిగబెట్టి వచ్చాడు.

"నీవు రేపు తప్పక మా యింటికి భోజనానికి రావాలి. మనం కొంతకాలం పోయిన తరువాత, విదేశాలకు వెళ్లుదాం. నీకు మార్పు చాలా అవుసరం" అన్నాడు లిప్టోవు ఫాయిడకును యింటికి తీసుకొనివెళ్ళేటప్పుడు.

"తప్పకుండా. తప్పకుండా వస్తాను నేను — మన చిట్టి చెల్లెలనుకూడ తీసుకొని వెళ్ళుదాము."

ఇంటికి తిరిగివచ్చేటప్పటికి యూలియ భయపడి ఏడ్వటం లేదుగాని, పరుపుపై పడి అటూ యిటూ దొర్లుతూ ఉంది. కళ్ళు పెద్దవిగా బెదురుతూ ఉన్నట్లున్నవి.

"నన్ను విడిచి వెళ్లకు. వెళ్ళకు అలెక్సీ." బ్రతిమాలు తున్నట్లుగా అంటూ "నేను పూజలు చేయటం ఎందుకు మానుకొన్నట్లు? నా నమ్మకాలన్నీ ఏమయినాయి? మీరు ఎందుకు మతాలనుగూర్చి, దేవునిగూర్చి నా ముందు వ్యతిరేకంగా మాట్లాడుతారు? మీరు, మీ స్నేహితులు నన్ను భయపెట్టారు. నేను యిక పూజలు చేయను" అన్నది.

లిప్టోవు ఆమె నుదురు నిమురుతూ, చేతులు రెండూ పట్టుకొని టీ యిచ్చి ఉపచర్యలు చేస్తూ కూర్చొన్నాడు. యూలియ భయపడి లేచి అతనిని గట్టిగా కరచుకుపోయినట్లు పట్టుకొన్నది.

తెల్లవారుఝామునకు ఆమె అలసిపోయి నిద్రపోయింది. లిప్టోవు ఆమె చేతులు పట్టుకొని ప్రక్కన కూర్చుని వున్నాడు. ఆ రాత్రి అతను నిద్రపోలేదు. తెల్లవారేటప్పటికి మానసికంగా, శారీరకంగా కూడ అలసిపోయాడు.

# 15

డాక్టర్లు ఫాయిడరుకు పిచ్చి అని చెప్పారు._ ఫయొట్స్కి టస్కాయ యింటి విషయం, షాపు విషయం ముసలాయన ఫాయిడరు లేకుండా ఏమి చేయాలో, ఎలా జరుగుతుందో లిప్తోవుకు అర్థంగాకుండా వుంది. యూలియ ఆ పనులన్నిటిని ప్రతిరోజూ తనను చూస్తూ వుండమని చెప్పినప్పుడు అతనేమీ మాట్లాడలేదు. పూర్వంవలె తన చిన్నతనంగూర్చి చెప్ప మొదలెట్టి కోపంగా తండ్రి వాళ్లను దూషించటంగాని చేయ లేదు.

ఒక ఆదివారంనాడు యూలియ ఫయొట్స్కి టస్కాయకు వెళ్ళింది. ముసలాయన కుర్చీలో కదలకుండా కనబడని తనకళ్ళు ఆర్పుతూ మాసిపోయిన బట్టలతో కూర్చుని వున్నాడు.

"నేనే యూలియను, మీ కోడలను, మిమ్ములను చూడ టానికివచ్చా" నన్నది యూలియ ముసలాయన దగ్గరకెళ్ళుతూ.

ఇన్నాళ్ళనుండి తన జీవితంలో అలా ఆప్యాయంగా, ప్రేమతో పలుకరించినవాళ్ళు లేకపోవడంవల్ల, ఆమెయొక్క ప్రేమకు, మమకారానికి ముగ్ధుడై, ఆవేశంతో గట్టిగా గాలిపీల్చి వదలటం మొదలుపెట్టాడు. ఆమెచేతులు ముద్దెట్టుకొని, ఆమే నని నిర్ధారణ చేసుకొనటానికి తల, ముఖం సవరించి దీవించాడు.

"మంచిదమ్మా మంచిది...నాకు కళ్ళుకన్పించవు... నేను నిన్ను కళ్ళారాచూడ నోచుకొనలేదు. కిటికీ, మంట

కొంచెంగా కన్పిస్తాయి. కాని మనుష్యులు, వస్తువులు కన్పించరు. నా స్థితి యిలా వుంది, ఫాయిదకు సేవటం లేదట. ఇక యిచ్చట మంచీ, చెడూ చూసేవారు ఎవ్వరూ లేరు. ఎవరైనా తప్పు చేస్తే వాళ్ళను శిక్షించేదెవరు ? పనిమనుష్యులు యిష్టం వచ్చి నట్లు ప్రవర్తిస్తున్నారు. ఫాయిదకుకు జబ్బేమిటి ? పడిశం పట్టిందా ? నా జీవితంలో నే నెప్పుడూ జబ్బుపడటంగానీ, మందులు తీసుకొనటంగానీ ఎరుగను. అస లెప్పుడూ డాక్టర్ల అవుసరమే కలుగలేదు."

మామూలుగానే ముసలాయన కేకలు వేయటం మొదలుపెట్టాడు. వంటమనిషి తొందర తొందరగా భోజనం వడ్డించాడు.

"నీవుకూడా నాతో భోజనం చేయాలమ్మా."

అతనిని తీసుకొని వెళ్ళి పళ్ళెంవద్ద కూర్చొనబెట్టి, కొద్దిగా వాడ్కా పోసిచ్చి "నేను రేపు మరల మీ మనుమరాళ్ళను సషా, లిడను తీసుకొనివస్తాను. వాళ్ళూ మిమ్ములను చూడా లంటున్నారు" అని చెప్పింది.

"వద్దు వద్దు, వాళ్ళను యిచ్చటకు తీసుకొని రావద్దు. వాళ్ళు శాస్త్రయుక్తంగా అమ్మకు, బాబుకు పుట్టినవాళ్ళుగాదు."

"మీ రలా అనటం భావ్యంకాదు. మీ అమ్మాయి, భర్తా శాస్త్రయుక్తంగా వివాహమాడిన భార్యాభర్తలు. అయినా, కాదంటే మీకే నామర్దా."

"కావచ్చు, నేను అనుమతించలేను. నేను వాళ్ళను మన్నించి దీవించను. వాళ్ళకూ, నాకూ ఏమీ సంబంధం లేదు."

"ఇది చాలా విచిత్రంగావుందే" అన్నది యూలియ నిట్టూర్చుతూ.

"పిల్లలు తల్లిదండ్రులకు భయపడాలని, వాళ్ళను గౌరవించి, వాళ్ళ ఆజ్ఞలను పాలించాలని బైబిలులో వుంది."

"కాదుకాదు, అలాకాదు. మనం శత్రువుల తప్పులను కూడ మన్నించి క్షమించాలని వుంది."

"మావిషయాలలో అలాంటిక్షమార్పణలు, క్షమించటాలు ఏమీలేవు. అలా ప్రతివారినీ క్షమించుతూ వుంటే మూడురోజులలో దివాళా ఎత్తుతాము."

"వ్యాపారం, డబ్బు వీటన్నిటికన్నా ఎక్కువైనవారిని క్షమించమని కోరింది."

యూలియ ముసలాయిన హృదయాన్ని మెత్తపర్చి వానిలో దయాదాక్షిణ్యాలు కలుగజేయా లనుకొన్నది. కాని చిన్న పిల్లవాగుతూవుంటే వినే పెద్దవానిలా, అతను ఆమె మాటలు విన్నాడు.

"మీరు ముసలివారైపోయారు. కొద్దికాలంలోనే దేవుని వద్దనుండి పిలుపువస్తుంది. దేవుడు మిమ్ములను, మీ వ్యాపారాన్ని గూర్చిగాని, దానిని మీరు ఎలా నడపి పైకి తీసుకొచ్చి, ఎలా లక్షలు సంపాదించినదిగాని అడుగడు. మీరు మీతోటి వాళ్ళతో దయాదాక్షిణ్యాలతో ప్రవర్తించారా? మీకన్నా తక్కువవాళ్ళమీద గుమస్తాలు, పనిమనుష్యులలాంటి వాళ్ళపై అక్రమముగా స్వారీ చేశారా?" అనిమాత్రమే అడుగుతాడు.

"నేను నా గుమస్తాలకెంతో సహాయం చేశాను. వాళ్ళు నాకు ఆజన్మాంతం కృతజ్ఞులై వుండాలి. నాలాంటి యజమాని

దొరికినందుకు, వాళ్ళంతా తామెంతో అదృష్టవంతులమని అనుకొంటూ వుండి వుండాలి" అని అన్నాడు ముసలాయన. యూలియ మాటలకు ముగ్ధుడై ఆమెను సంతోషపెట్టటానికి "సరే, రేపు నీవు ఆ పిల్లలను తీసుకొనిరా. వాళ్ళకు ఇవ్వటానికి ఏవో కొనికూడ వుంచుతా" అన్నాడు ముసలాయన చివరకు ఉల్లాసంతో.

ముసలాయన బట్టలేమిటోగా వున్నాయి. ఆ మురికి బట్టలను శుభ్రం చేయించాలనిగాని, బట్టలనిండా పడివున్న కాల్చిన చుట్టపొడిని దులపాలనిగాని, బూట్లను పాలిష్ చేయించాలనిగాని, ముసలాయనను గూర్చి జాగ్రత్త తీసుకొనాలని గాని ఎవ్వరికీ పట్టినట్లులేదు. వంటకూడ సరిగా చేసిపెట్టటంలేదు ఉడికీఉడకని వంటకాలు పెడుతున్నారు. ముసలాయన ఆరోగ్యం గూర్చిగాని, యింటిశుభ్రతనుగూర్చిగాని ఎవ్వరూ పట్టించు కొన్నట్లుగా లేదు. తనుగాని, తన భర్తగాని, యిప్పటివరకు, కలుగజేసుకోనందులకు యూలియ చాలసిగ్గుపడింది.

"నేను తప్పకుండా రేపు వస్తానని" చెప్పి యూలియ అన్నిగదులలోకి వెళ్ళి శుభ్రంగా ముసలాయనకు పక్క లేయించి "ఫాయిడరు" గదిలోనికి వచ్చింది. పుస్తకం తెరచి దానివంక చూస్తూ కూర్చున్నాడు. ఫాయిడర్ యూలియ అతనితో ఏదో మాట్లాడి అతని గదినికూడా శుభ్రం చేయించి తర్వాత గుమస్తాలు ఉండే గదులలోనికి వెళ్ళి చూచింది. ఆ ప్రదేశమంతా అసహ్యంగా వాసనవేస్తూవుంది. ఆదివారమవటంవల్ల గుమస్తాలంతా ఇంటివద్దనే వున్నారు.

నేరస్తులులా నిలబడి వారంతా ఆమె అడిగిన ప్రశ్నలకు భయ భక్తులతో సమాధానమిచ్చారు.

"ఏమిటీ—ఈ ప్రదేశం అసహ్యంగా లేదు" అంటూ చేతులు తిప్పుతూ "మీకు ఇరుకుగా లేదూ?" అని అడిగింది.

"అదేమీ లేదమ్మా! మీ దయాదాక్షిణ్యాలు కలిగి వుండటమే మా అదృష్టం. మీ శుభసంపదలకు మేము దేవుని సర్వదా ప్రార్థిస్తూ వుంటాము" అన్నాడు మకేషు.

"జీవితకాలం—స్వంతలాభం" అన్నాడు పోచాట్కిన్.

"ఉన్నదానితోనే తృప్తిపడేవాళ్ళమమ్మా మేము" అన్నాడు మకేషు.

తర్వాత జూనియరు గుమస్తాలు వుండేచోటుకు వెళ్ళింది. అదికూడా చాలా అసహ్యంగానే వుంది.

ఇచ్చటనుండి మనం యెంత తొందరగా వీలయితే అంత తొందరగా "పయాట్నిటస్కాయి"కు మారాలి. ఇకనుండి మీరు ప్రతిరోజూ షాపుకువెళ్ళి మంచీచెడూ చూస్తూవుండాలి అని చెప్పింది యూలియా, భర్తకు ఊరినుండి తిరిగిరాగానే.

వాళ్ళు చదువుకొనే గదిలో మాట్లాడకుండా ఒకరి ప్రక్క ఒకరు కూర్చునివున్నారు. అతని హృదయం చాలా బరువుగా వుంది. పయాట్నిటస్కాయి యింటికిగాని, షాపుకు గాని వెళ్ళడం అతనికి ఏమాత్రం యిష్టములేదు. అతని భార్య ఉద్దేశ మేమిటో అతనికి బాగా తెలుసు. ఆమెను కాదనే ధైర్యం అతని కిప్పుడు లేదు.

"మన జీవితకాల పరిమితి పూర్తి అయిపోవచ్చినట్లు, ఏమిటో సిర్జీవులుగా బ్రతుకుతున్నట్లుగా వుంది" అంటూ

ఆమె బుగ్గను చిన్నగా కొడుతూ, ఫాయిడమకు జబ్బుచేసి నప్పుడు ఏడ్చాను. మేము చిన్నప్పుడు ఒకటిగా కలిసిమెలిసి బ్రతికాము. అతనంటే ఒకనాడు నాకు విపరీతంగా ప్రేమ వుండేది. ఈనాడు యీ ఉపద్రవం వచ్చింది. నేను నా గతాన్నుండి మంచికి విడిపోతున్నా ననుకుంటా. ఆ జైలుకు ...ఆ యింటికి, ఎప్పుడు వెళదామో చెప్పు. నాకు భవిష్యత్తు అనేది లేదు" అన్నాడు లిప్టోవు.

లేచివెళ్లి కిటకీవద్ద నుంచున్నాడు.

"అవును. ఆనంద అనురాగాలకు, సుఖానికి, సంతో షాలకు ఒకనాడు ప్రతివారూ తిలోదకా లివ్వాలి" అంటూ బయటకుచూస్తూ "సుఖం అనేది మానవజీవితాని కున్నదా అని నా అనుమానం. అలాంటి దేమీ లేదనుకుంటా, నిజానికి యీ లోకంలో ఎవరు సుఖపడుతున్నారు. కాని – నిజంగా ఒక విధంగా నే నదృష్టవంతుడననే చెప్పాలి. ఒక్కసారయినా, ఒక్క నిమిషమైనా, ఆనందాన్ని అనుభవించాయీ నా నికృష్ట జీవితంలో. ఆ రాత్రి......నీ గొడుగు వేసుకుని కూర్చున్న రోజు రాత్రి, నీవు మా అక్క యింటివద్ద గొడుగును వదలి పెట్టి వెళ్ళావు గుర్తుందా?" అంటూ ఆమెవంక తిరిగి "ఆరోజు లలో నేను నిన్నెంతగానో ప్రేమించేవాడిని. అప్పుడే, ఆరోజు లలో, ఎంతో హాయిగా, స్వర్గంలో వున్నట్లుగా, నీ గొడుగు క్రింద కూర్చొని ఎలా తలపోశానో, యిప్పటికీ బాగా గుర్తు వుంది" అన్నాడు.

అచ్చటనే ఒకమూలపాతవి, పనికిరానివి పడవేసి వున్నాయి. వాటిల్లో గొడుగుఒకటి. అది బయటకుతీసి భార్యకు చూపించుతూ ఇదిగో అన్నాడు.

యూలియ ఒక్కనిమిషం దానివంకచూసి, గుర్తుపట్టి విచారంగానవ్వి వూరుకొన్నది.

“అవును. నాకు బాగానే గుర్తువుంది. మీరు మొదట సారిగా, మన వివాహవిషయం ఎత్తినప్పుడు అది మీ చేతి లోనేవుంది” అన్నది.

లిప్టోవు బయటకువెళ్ళ బయలుదేరినప్పుడు, “కొంచెం తొందరగా యింటికి తిరిగిరండి. నేను వంటరిగా వుండవల్సి వస్తుంది. నాకు చాలా భయంగావుంటుంది. మీరు లేకుండా, ఒంటరిగా వుండటం నాకు ఏమిటోగా వుంటుంది” అన్నది చాలా జాలిగా.

తన గదిలోనికి, తన పాతగొడుగును తీసుకెళ్ళి, తదేక దృష్టితో, చాలాసేపు దానివంకచూస్తూ గడిపింది.

# 16

వాళ్ళది పెద్ద వ్యాపారం అయినా, వాళ్ళు లెక్కలు, డొక్కలు సరిగా వుంచుకొనడానికి తెలిసిన గుమాస్తాను వుంచుకొననేలేదు. జర్మను. ఇంగ్లీషు వ్యాపారస్తులు వచ్చి, రాజకీయాలు, మతాలనుగూర్చి మాట్లాడుతూ వుంటారు. ప్రతిరోజూ ఒక ప్రాగుబోతు విదేశ వృత్తరాలు తర్జుమా చేసిపెట్టడానికి వస్తూవుంటాడు. అతని ‘టీ’ లో ఉప్పుకలిపి అందరూ ఆడిస్తూవుంటారు.

లిప్టోవు ప్రతిరోజూ షాపుకు వెళ్ళుతూ మాగ్స్ను తీసుకొనిరావడానికి సర్వప్రయత్నాలు చేస్తాడు. పని నేర్చుకొనడానికి వచ్చిన గుమాస్తాలను దండించవద్దని శాసించాడు. ఎప్పుడైనా పనికిరాని సరుకు, బేరగాళ్ళకు మోసం చేసి అమ్ముచున్నప్పుడు గుమాస్తాలను కోప్పడుతూ అలా చేయాలి, యిలా చేయాలి అని చెబుతూ వుండేవాడు ఇప్పుడతను సర్వాధికారి. కాని, అతనికి లాభనష్టాలు, మంచీ - చెడూ, పెద్ద గుమాస్తాల జీతం ఎంతెంత ? ఏమీ అతనికి తెలియకుండా వుంది. పోచాట్కిన్, మకీషులు, ఇప్పటికీ అతనిని క్షుద్రవానిగా, అనుభవంలేనివానిగా చూస్తూనే వున్నారు. రోజూ సాయంకాలం ముసలాయనతో రహస్య సమాలోచనలు సాగిస్తూ వుండేవారు.

ఒకరోజున లిప్టోవు పోచాట్కిన్‌తో ఖచ్చితంగా మాట్లాడవలె ననుకొన్నాడు. పోచాట్కిన్ తనకు ఎనిమిది సంవత్సరాలు వయస్సువుండగావచ్చి అచ్చట చేరాడు. కుటుంబములో ఒకడుగా పెరిగి పెద్దవాడయాడు. చాల నమ్మకస్థుడు కూడ. అతను షాపులోనేగాక, యింటిలో, చర్చిలో కూడ ముసలాయన లేనప్పుడు, ముసలాయన పనులన్నీ ఏ కొరతా లేకుండా చూస్తూ, చేయించుతూ వుంటాడు. ఇతర గుమాస్తాలను చాల తేలికగా చూస్తూ వుంటాడు కూడ.

"నిజమేనా, మన వ్యాపారం కొద్ది సంవత్సరాలనుండి తగ్గిపోతూ వున్నదని విన్నాను" అని అడిగాడు లిప్టోవు.

"అనుకొనేటంతగా ఏమీ గాదు."

"నిష్కల్మషంగా నాకు నిజం చెప్పు. లాభం ఎంత వస్తూవుంది? మన పెట్టుబడి ఎంత? ఎంతకాలమని యిలా తెలియకుండా వ్యాపారం చేయడం? నేను కొన్ని లెక్కలు చూశాను, కాని నాకు వాటిల్లో నమ్మకంలేదు. మీరు నాకు ఏమీ చెప్పకుండా, నన్ను అజ్ఞానిలాగుంచి, ముసలాయనతో మంతనాలు జరుపుతూ వ్యాపారం చేస్తూవాలనుకోవడం ఏమంత మంచిదిగాదు. చిన్నతనంనుండి అదొక నీ ఆశయంగా చూస్తూ వచ్చావు, కాని యిక అలా వీలుపడదు. అది మానటానికి యిది సమయం. నిష్కల్మషంగా యిప్పుడైనా మన వ్యాపారపు మంచిచెడులు నాకు చెప్పు."

"అది అంతా ధరలమీద, మార్కెట్టుమీద ఆధారపడి వుంటుంది."

"అంటే నీ ఉద్దేశ్యం?"

పోచాట్కిన్ ఏదో చెప్పాడు. కాని లిప్టోవుకు ఏమీ అర్థంకాలేదు. మకీషుకుకూడ కబురుపంపాడు. అతను వచ్చి లిప్టోవును పొగడటం సాగించాడు.

"ఇక నీ పొగడ్తలు ఆపు. నన్నేమీ నీవు దేవునిగా తలంచ నవసరంలేదు" అన్నాడు లిప్టోవు.

"ప్రతి మనిషి తానెవరో, తన స్థితి ఏమిటో తెల్సుకోవాలి. దేవునిదయవల్ల, మా అదృష్టంకొద్దీ నీవు మా తండ్రిలాంటివాడవు, మా ధర్మకర్తవు, మేము నీ సేవకులము."

"ఏ!య్ ఇటు చూడు. ఇలాంటి చెత్తవిని, నాకు విసుగెత్తిపోయింది. నీవు మా కుటుంబపు మేలుకోరేవాడవయితే యీ వ్యాపారం గొడవలు నాకు వివరంగా చెప్పు. మీరు గనుక

నన్ను చిన్నపిల్లవానిగా చూడటం మానుకొనకుండావుంటే, వెంటనే యీ షాపును మూసివేస్తాను. మా నాన్న గ్రుడ్డివా డయ్యాడు, మా అన్నగారు పిచ్చిఆస్పత్రిలో వున్నాడు. నా మేనగోళ్ళకు యింకనూ మైనారిటీ వెళ్ళలేదు. నిజానికి యీ వ్యాపారంఅంటే పరమఅసహ్యం. రేపే మహాసంతోషంగా దానికి స్వస్తిచెప్పగలను. మీకు తెల్సుననుకొంటాను, ఇంక ఎవరూ దానిలో చేయిపెట్టేవారులేరు. కాబట్టి మీ మూర్ఖపు తెలివితేటలు తెలివితక్కువ ఆశయాలు, యీ అర్థంలేనిపనులు మానండి," అన్నాడు లిప్టోవు ఎంతో కోపంగా.

వాళ్ళంతా కల్సి లెక్కలు చూడటం మొదలుపెట్టారు. సాయంకాలం యింటివద్ద ముసలాయన సహాయంకూడ దొర కేది. ముసలాయనకూడ తన కుమారునకు వ్యాపార రహ స్యాలు తెలుపదల్చుకొన్నాడు. అంతాచూస్తే అది వ్యాపా రంగాదు, మ్యాజిక్ అనిపిస్తుంది. లెక్కలనుబట్టి రాబడి పూర్వం కన్న పెరిగినట్లు, అంతా మొత్తం యిప్పుడు 60 లక్షల రూబుళ్ల వరకు వున్నట్లుగా తేలింది.

లెక్కల గొడవలతో సతమతమవుతూ ఉక్కపోస్తూ వుంటే, అర్థరాత్రిప్పుడు గాలికొరకు, వెన్నెలలో బయటకు వచ్చాడు. బయట చాలా ప్రశాంతంగావుంది. బాగా ఉక్క పోస్తూవుంది. ఆ వెన్నెలలో, తెల్లనిగోడల మాస్కో యిళ్ళు, పెద్ద పెద్ద గేట్లతో, ఒక కోటగా – తుపాకితో ఒక కాపలా వాడే తక్కువగా తలంచాడు. లిప్టోవు నెమ్మదిగా వాళ్ళ చిన్న తోటలోనికివెళ్ళి బెంచీపై కూర్చొన్నాడు. వాళ్ళ స్థలంకు, ప్రక్కవారిస్థలంకుమధ్య తీగమట్టుకు అడ్డంగవుంది. అతడు అచ్చట

తన చిన్నప్పటినుంచీ వున్న ఒక చెట్టును చూశాడు. దానిలో అప్పటికీ, యిప్పటికీ అతనికి ఏమార్పూ కన్పించలేదు. పూర్వం ఎంత పొడుగుగా ఎలా వున్నదో యిప్పుడూ అలాగే వుంది. పూర్వంవలెనే అతను చెట్ల సందునుండి చంద్రుడిని, తర్వాత చీకటిని, తోటమధ్యలో తిరుగుతున్న నల్లకుక్కను, తెరిచివున్న గుమస్తాల గదుల కిటికీలను చూశాడు. ఇవి అన్నీ అతనిలో ఏమీ ఉత్సాహాన్ని కల్గించలేకపోయినవి సరిగదా, చిన్నతనాన్ని గుర్తుతెచ్చి చాల బాధపెట్టాయి.

పొరుగువారి స్థలంలో ఎవరో నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకొంటూ నడుస్తూన్న శబ్దం విన్నాడు.

"ప్రేయసీ—నా ప్రియమైన—"అని తనకు చాల దగ్గరలో ఒక మొగగొంతుక అనటం విన్నాడు. వాళ్ళ బరువైన ఉచ్ఛ్వాస, నిశ్వాసాలుకూడ అతనికి వినిపిస్తున్నాయి. వాళ్ళు ఒకరినొకరు ముద్దిడుకొంటున్నారు.

లిప్టోవు డబ్బును, ఆ డబ్బును కూడబెట్టిన వ్యాపారాన్ని అసహ్యించుకొంటున్నాడు. అవి అతనిని బానిసగా చేసి, జీవితాన్ని నాశనం చేసినట్లుగా తలంచాడు. అతను ఎలా వ్యాపారానికి అలవాటు పడబోతున్నదీ దానిలో ఎలా పాతుకొనిపోయి ముసలివాడై కదల మెదలలేక వూరూ పేరూ లేకుండా నికృష్ట నిర్జీవిలాగ చావటం మొదలగు విషయాలు భవిష్యత్తును గూర్చి ఆలోచించుతూ కూర్చొన్నాడు. కాని అతను వ్యాపారాన్ని వదులకొనలేకుండా వుంటానికి చిన్ననాటినుండీ అసహ్యించుకొనే తోటను విడిచి వెళ్ళకుండా అతనిని ఆపిన దెవరు?

ప్రక్కతోటలో అమ్మాయి, అబ్బాయి గుసగుసలాడుతున్నారు. వాళ్ళ మాటలు, ముద్దులు అత నూహించిన

ప్రేమకలాపాలు అతనిలో మార్పును కలిగించాయి. తోట మధ్యకు వెళ్ళి చంద్రుని చూస్తూ నిల్చున్నాడు. ఒక్క నిము షంలో గేటు దాటి బయటకుపోయి మరల తిరిగి రాకుండా వుంటే ఎంత బాగుంటుందోననే ఆలోచన అతనిలో స్వేచ్ఛా ఊహాలు రేపింది. జీవితం ఎంతఆనందకరంగా, గొప్పగా బహుశ తపస్వినిగా ఎంత హాయిగా వుంటుందో ఊహించుకొని బిగ్గ రగా నవ్వాడు.

కాని అతను అచ్చటనుండి కదలలేదు. "ఏమిటి నన్నా పుతూ వుంది" అని ప్రశ్నించుకొన్నాడు తనలో తాను. తనను తానే అసహ్యించుకొన్నాడు. బయటకుపోయి స్వేచ్ఛగా పచ్చని పొలాలలో, అడవులలో హాయిగా బ్రతుకలేక అచ్చట బండపై పడుకొని వున్న కుక్కనుకూడ చూసి చాల జాలి పడ్డాడు. నిజానికి ఆ కుక్కకు, తనకుకూడ యీ ప్రదేశంవదలలేక పోవటానికి ఒకేరకమైన కారణాలు, అనుబంధ సంబంధాలు వున్నవేమో! బానిసత్వానికి అలవాటు పడిపోయారేమో!

మరునాడు మధ్యాహ్నం యాట్రిస్విని జతతీసుకొని, తను కుటుంబం అంతా వేసవికాలం గడుపుతున్న "బూబో వో"కు వెళ్ళాడు. అతని భార్యనుచూచి అయిదు రోజు లయింది. వాళ్ళు యిద్దరూ టాక్సీలో బయలుదేరారు. యాట్రిస్వి పాటలుపాడుతూ, వాతావరణాన్ని పొగుడుతూ వున్నాడు. ఇల్లు ఒక పెద్దతోటమధ్య వున్నది. యూలియ గేటుదగ్గర, వేసవిదుస్తులతో తన పాతగొడుగు పట్టుకొని వుంది. యాట్రిస్వి యూలియను పలుకరించి యింటివైపుకు వెళ్ళాడు. సషా, లిడాగల్లంతు చేస్తూ వున్నారు. లిప్టేవు తన భార్యతో మాట్లాడటానికి కూర్చొన్నాడు.

"మీరింతకాలం ఎక్కడవున్నారు?" అంటూ యూలియ అతని చేయి నివదలకుండా "ప్రతిరోజూ యిక్కడ కూర్చొని మీకోసం ఎదురుచూస్తూ వుండేదానను. మీరు లేకపోవటంవల్ల ఎంతో వంటరిగా, భయంగా వుంటూ వుండేది అన్నది.

ఆమె అతనిముఖంవంక చూస్తూ, తలనిమురుతూ ఎంతో సిగ్గుపడుతూ "మీకు తెల్సునా? మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. మీరే నాసర్వస్వం. మీరు తిరిగివచ్చారంతే చాలు, యిక వెళ్ళకండి. మీరూ, నేనూ హాయిగా, సంతోషంగా కాలంగడుపుతూ యిక్కడనే వుందాం ఏవో కబుర్లు చెప్పండి," కాస్త మాట్లాడండి! అన్నది.

ఆమె తన ప్రేమను వెల్లడించినప్పుడు ప్రేమిస్తున్నట్లు చెప్పటం విన్నప్పుడు అతను వారిద్దరూ పది సంవత్సరాలనాడు వివాహ మాడినట్లుగా తలంచాడు. అతనికి ఆకలి వేస్తూవుంది. ఆమె తన రెండు చేతులూ అతని మెడచుట్టూ పోనిచ్చి, అతని హృదయానికి హత్తుకు పోయింది. నెమ్మదిగా లేచి, ఆమె చేతులు విడిపించుకొని, యింటిలోనికి నడిచాడు. పిల్లలు ఎదురుగా పరుగెత్తుకొచ్చారు.

"ఎంతగా పెరిగారంటేను పిల్లలు; మూడు సంత్సవరాలలో ఎంత గొప్పమార్పులు వచ్చాయి. అన్నిటినిగూర్చి ఆలోచించటానికి బహుశ 13 సంవత్సరాలో లేక 30 సంవత్సరాలో బ్రతకాలి. ఎవరికి తెల్సు అప్పటిపరిస్థితి ఎలా వుంటుందో? ఎన్ని మార్పులైనా జరుగవచ్చు. మనం చూస్తూ వేచివుండటంకన్నా చేయగల్గిందేముంది" అనుకొన్నాడు లిస్టోవు తనలో తాను.

సషాను, లిడను ఎత్తుకొని వాళ్ళను ముద్దిసుకొంటూ "తాతగారు మీకు తన ఆశీస్సులు చెప్పమన్నారు. పెద్ద మామయ్య చనిపోవటానికి సిద్ధంగావున్నాడు. కోష్టియా అమెరికా నుండి మీకు దీవెనలుపంపుతూ ఉత్తరం వ్రాశాడు. అక్కడతని కేమీ బాగాలేదట, అందువల్ల త్వరగానే తిరిగి వస్తానని వ్రాశాడు. మీ చిన్న మామయ్యకు ఆకలి మండి పోతూవుంది" అన్నాడు.

తరువాత వరండాలో కూర్చొని అతనిభార్య నెమ్మదిగా ఆశ్రోవను యింటికి వస్తూవుండటం చూశాడు. ఆమె యేదో పెద్ద బాధగా ఆలోచిస్తూ వున్నది. ఆమె ముఖం విచారంతో నిండివుంది; కళ్ళు నీళ్ళతో నిండివున్నాయి. ఇప్పుడామె అందమైన, అతి సున్నితమైన 'పిల్ల' ఏమీగాదు. ఇప్పుడామె అనుభవజ్ఞురాలైన అందమైన ఒక స్త్రీ. ఆమె ముఖంలో క్రొత్త అందంచూసి, జీవితంలో మొదటసారిగా కల్సుకొన్నట్లు ఎదురుగా వెళ్ళుతున్న యార్టిస్విని చూస్తూ కూర్చొన్నాడు లిప్టోవు. వాళ్ళందరకూ భోజనాలు వడ్డించారు. యార్టిస్వి యూలియాను ఆమె మెడక్రింద వున్న మడతను చూచినప్పుడు చక్కని చిరునవ్వు అతని పెదవులపై తొణికిసలాడింది. లిప్టోవు యార్టిస్వివంక చూడకుండా వుండలేక చూస్తూ పదమూడు సంవత్సరాలు గాదు, ముప్పైసంవత్సరాలు గడపవల్సివుందను కొన్నాడు. ఆనాటికి పరిస్థితి ఎలావుంటుందో? ఎన్నోక్రొత్త విషయాలు జరుగవచ్చు. భవిష్యత్తునుగూర్చి ఎవరు చెప్పగలరు?

"చూస్తూ వేచివుండటంకన్నా చేయగల్గింది ఏముంది" అని అనుకొన్నాడు.



మీరు తప్పక చదవవలసిన గ్రంథాలు

నవలలు :

| | | |
|---|---|---|
| పారిస్ పతనం | ఇల్యా ఎహ్రెన్ బర్గ్ | 10-[illegible] |
| నేరము - శిక్ష | దాస్టొవస్కీ | [illegible] |
| అదృశ్య జీవులు | అంతోనీనా కొప్తాయెవా | |
| కాకలుతీరిన యోధుడు | నికొలాయ్ ఓస్త్రోవ్స్కీ | |
| బీజ్యదున్నేరు | షోలొకోవ్ | |
| పేదల బ్రతుకులు | డాస్టొవస్కీ | |
| పునరాగమనం | బోరిస్ పోలెవాయ్ | |
| అపరిచిత | గలినా నికొలయెవా | [illegible]-25 |

కథలు :

| | | |
|---|---|---|
| గొప్పవారిగోత్రాలు | సాల్టికోవ్ షెడ్రిన్ | 3-50 |
| అరుణరేఖలు | యురీ రైఖేవ్ | [illegible] |
| బెల్కిన్ కథలు | పుష్కిన్ | 2-00 |

విజ్ఞాన గ్రంథాలు :

| | | |
|---|---|---|
| లోకాంతరయానం | కారల్ గిల్జన్ | 6-00 |
| మీకు తెలుసా | ఇలిన్ & సెగాల్ | 4-00 |

విశాలాంధ్ర ప్రచురణాలయం,

బకింగ్‌హాంపేట : : విజయవాడ.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B134 |
| పుస్తకం పేరు | మూడేళ్ల ముచ్చట |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CT, 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసేవది | Habeeba |
| పేజీలు విడదీసేవది | Navya |
| స్కాన్ చేసేవది | Daveeb |
| పరీక్ష చేసేవది | RAMYA |
| పేజీలు సరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | good |